# అంకితం

శివ శ్రీ

తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి

అన్నగారికి భక్తితో

ఈ రాగమాలికను. అర్పిస్తున్నాను.

— బాపిరాజు.

# ఇందులో ...

# నరపతి

ఓ నరపతీ! నువ్వు ముప్పైయిద్దరు రాజకుమారులు మోసే వివిధరత్న సువర్ణపల్యంకిపై ఊరేగుతూ ఉంటావు. గౌరీశంకరశృంగమహామహిమప్రదేశాలలో తిరుగాడే దేవమృగ చామరాలతో నవయౌవన చంద్రికాస్నాతలైన మహారాజకుమారికలు పదహారుగురు మంజులకంకణకింకిణీ స్వనాలు వెలయ నీకు సదా వీస్తూఉంటారు. నీ వైభవం యక్షపతి కుబేరుడికూడ లేనేలేదు.

నరపతీ! నీ క్రీగంటివిరుపులు చూడగానే హిమాలయాది పర్వతములు కదలిపోతాయి. సదా సంతోషంతో ఉప్పొంగే ఒంటివాడైనా సముద్రుడు ఇంకిపోతాడు. అనేకోర్మికోజ్వలితమైన నీఅంగుళీవ్యంజనములకు ఒక్కసారిగా ఇరువది యొక్క అక్షౌహిణీలు గజ తురగ పదాతులు, సర్వనౌకా బలాలు హుమ్మని ముందు కురికిపోతవి. మానవావృత నిబిడ జనపదములు ఎడారులైతే, మరుభూములు పట్టణాలౌతవి. నీ బలసంపత్తి దేవచమూపతియగు కుమారునకే లేదు.

## 2

ఆ నరపతి ఒకనాడు ముప్పైరెండు రాజ్యాలకు పాలకులగు తన సామంతులకుమారులు మోసే అందలమునుంచి దిగాడు. మంచి అందమైన వస్త్రాలు ధరించి, అంతఃపురంలో అంతటా ఏమాత్రం దారికైనా ఎడంలేకుండా, అడ్డంగాపండుకొనిఉన్నారు, తానుజయించినలాతిరాజ్యాలనుంచిఖైదీలుగా

పట్టుకోనివచ్చిన మంత్రులు, సేనానాయకులు, రాజకుమారులున్నా—వాళ్ళమీదనుంచి రాళ్ళుపొదిగి నబంగారపుచెప్పులతో నడుస్తూ తనమందిరం చేరాడా రాజు. ఆమందిరవైభవం మచిలీపట్టణపు పల్యాంకపురీ ప్రతిసీరాదులు, గంధాతిముక్తక శ్రీపర్ణికాది దారువులశిల్పములుగల గోపానసీపటలాదులు, దంతస్తంభాలు, రత్నస్థగిత సువర్ణసింహాసనాలు, సింహశార్దూల మృగాదన కృష్ణసారాది మృగచర్మాలు, సువర్ణధూపదీప స్తంభాలు, కాశ్మీరపు పట్టుపనిచేసిన దుకూలాంబరాల చాందినీలు, అందుండి వ్రేలాడు నీలగారుత్మతలోహితక, వజ్రముల దీపపుబుడ్లు, భీమ, వాయుపుత్రాభిమన్యు, రామ, రావణ, సుందోప సుందాదిపీఠల చిత్రలేఖనములు, స్ఫటిక రత్న నీలాది వివిధవర్ణ శిలలు, చంద్రశిలలు చెక్కినశిల్పాలు.

ఆ నరపతి వచ్చి పట్టుతలగడలు, పరుపులు వేసిన ఒక పీఠముపై అధివసించగా, పూర్ణచంద్రబింబాస్యలగు బాలికలు వచ్చి, కొందరు సువాసనవేళ్ళ విసనకఱ్ఱలతో వీస్తున్నారు. కొందరు వీణాగీతాలతో కంఠాలు మేళవించి, కాకలీధ్వనులతో పాటలు పాడుతూ ఉన్నారు కొందరు పాదసేవ చేస్తూ ఉన్నారు. కొందరు నర్తనంతో వయ్యారంగా అతని దేహమునకు లేపూత పూయుచున్నారు.

ఆ నరపతి మహాసత్త్వుడు, ఆజానుబాహుడూ అయి ఉన్నాడు. అతని విశాలమైనవక్షం హిమాలయపర్వత సానువులా ఉంది అతనిభుజాలు. చేతులు ఏనుగుకుంభాలు, తొండాలు. ఆ నరపతి గౌరీశంకరశృంగంలా మహోన్నతరూపుడు. మల్లయుద్ధ గదాయుద్ధాలలో శక్తి, తోమరం అవీ అత్యంత

నిపుణంగా వేయటంలో యిరువదినాలుగు రీతుల కత్తిసాములు, ఘాతము, గతి, వక్రము, ప్రతిఘాత, అవగతి, లక్ష్యము మొదలైనవాటిల్లో అత్యంతంగా ప్రావీణ్యం ఉంది. ధనుర్వేదంలో అర్జునుణ్ణి మించిపోతాడు. గజతురగశాస్త్రము లతనికి అశ్వనీకుమారులకుమల్లే అతివిచిత్రంగా వచ్చు.

ఆ నరపతి చాలా అందమైనవాడు. అతన్ని చూస్తే అప్సరసలు మొదలైన దివ్యనారీమణులకూడా హృదయం కొట్టుకొనేది. దేవతల్లోనే లేడు ఆతనితో సమానమైన సుందరమూర్తి. అతడు అన్నికళల్లో, అన్నిశాస్త్రాలల్లో మహాసిద్ధి సంపాదించాడు.

సేనలు నడపడం, కొద్దిసేనలతో గొప్పసైన్యములను కూడా చీకాకుపరచి నాశనం చేయడం, ఘనవ్యూహాలు పన్నడం, వీటిల్లో ద్రోణాచార్యుడుకూడా అతనికి ఈడు కాడు.

భయంకరంగా యుద్ధముజరిగినప్పుడుకూడా అతని సైన్యాలల్లో భటులు ఎప్పుడూ కొద్దే నశించడం. రథ గజ తురగ పదాతిదళాలప్రతినిధులు, సముద్రాల్లో ఆ నరపతి యుద్ధనౌకలనావికులు అందరూ అతడంటే మహాప్రేమతో ఉంటారు. ఆతడు వారికి నచ్చిన నాయకుడు. గొప్పగా ధన మిచ్చు ప్రభువు, వారి హృదయం రంజించే వీరుడు.

దేశాలన్నీజయించాడా నరపతి. కానుకలూ, కప్పాలు కొన్నాడు. రాజసూయయాగములు మూడు చేశాడా చిన్నతనంలోనే-అన్నము కాకపోయినా.

# 3

ఆ నరపతికి ప్రపంచమన్న కోపము. నరులన్న హేయము. ప్రజలందరు కాకులగుంపులు. వాళ్ళచిత్తవృత్తులు అతిచంచలమైన పొగమంచులు. ఉత్తమపురుషులకు సామాన్యమానవులు బానిసలు. వాళ్ళకి దాస్యంచేయటానికే ఆ పసదాలు పుట్టింది. ఈ ప్రపంచంలో మహాసత్త్వులకు తప్ప యింకెవ్వరికీ తలయెత్తి తిరగడానికి స్వాతంత్రంలేదు. వాళ్ళు సామంతరాజులైతేనేం? మండలాధిపతులైతేనేం? అందరూ ఒక్కడికే శుశ్రూష చేయాలిసిందే.

ఆ నరపతితో సమానమైన గొప్పదనంకలవాళ్ళు లేనే లేరు. ఏరాజైనా తనక్రిందివాడే. భరతదేశం అంతా దిగ్విజయయాత్రలు చేశాడు పదిహేనుసార్లు. కామరూప, వంగ, మగధ, మాళవ, మత్స్య, పాంచాల, కాశ్మీర, గాంధార, సింధు, బర్బర, కాంభోజ, అవంతి, ఘూర్జర, పుళింద, కళింగ, పాండ్య, చేర, చోళ, కేరళాది సకల రాజ్యాలు అతనికి లోబడ్డాయి. ముప్పదియారు ద్వీపాలు — సువర్ణ, యవ, కుశ, అపవర్ణ, జవన, సుమిత్ర, సింహాళ, క్రౌంచాది ప్రాచ్యద్వీపములు, యవనచంద్ర, అపరాంత, పాహ్లవ, రోమకాది ప్రతీచీద్వీపములు, వాటి ప్రభువులు అతని నౌకాబలాలకు జోహార్లు చేశారు.

అంత మహాబలవంతుడై రాజ్యంచేస్తూ ఆ నరపతి ప్రజాకంటకుడయ్యాడు. ప్రజలదగ్గిర పన్నును ఎక్కువ వసూలుచేయడమే కాదు, వాళ్ళని దోచుకోవడమే కాదు;

వాళ్ళంటే ఉండే నిరసనచేత, వాళ్ళకష్టసుఖాలు విచారించడం గాని, వాండ్లకు సౌకర్యాలు కలుగజేయడంగాని వాళ్ళ కుసరి మైన న్యాయంకలిగేట్టుచూడడంగాని, సుతరామూ ఏమిన్నీ లేదు. తన కింద ఉండే సామంతరాజులు ఎవరైనా తన మండలంలో ప్రజానురంజకులై వారిని సకల ధర్మయుక్తంగా పరిపాలన చేస్తూఉంటే, ఆరాజులను ఈ నరపతి హేళన చెయ్యడం వాళ్ళను తన మహాసభలో అగౌరవపరచడం.

నరుల్ని వాహనంగా జేసి నైరుతినిమించిన రాక్షసుడై నరబాధకుడై మహా అందగాడై ఆనరపతి మహాభయంకర భుజంగంలా, చండ మృగాదనంలా, క్రూరసౌందర్యంతో విరాజిలుతూ ఉండేవాడు.

# 4

ఆనాడు అలా మందిరంలోశయనించిఉండి, మూలగా వీణవాయిస్తూఉన్న ఒక దివ్యమోహనవిగ్రహమైన చిన్న దాన్ని తనదగ్గరకు రమ్మని సైగజేశాడు ఆ నరపతి. ఆమెను వర్ణించాలంటే మనోహర సుగంధకుసుమాలన్నీ మలగి కలగి పోతవి. మంజులసౌదామినీలతలు మసకమసకలై పోతవి.

ఇరువదివర్షాలుప్రాయంవాడైన ఆ నరపతి వివాహము చేసుకోనలేదు. వివాహం అతని కేమీ ఇష్టంలేదు. స్త్రీఅంటే అసహ్యము. జీవ ప్రపంచంలో హేయమైంది వనిత. వాళ్ళు సేవకేకాని, ఉద్వాహంచేసుకోనడానికా? ఆ నరపతి ఘోటక బ్రహ్మచారి.

వణుకుతూవచ్చింది ఆకన్యక నరపతియెదుటకు."భరత

వర్షంలో ఉన్న అద్భుత లావణ్యవతీ గణములలోకెల్ల నువ్వు చాలా అందమైనదానవుటగా! నీ కన్నులు ఆనందంలో నిర్మల నీలాభ్రపథమున తేలియాడి సర్వవర్ణాల మినుకాడు నక్షత్రాల్ని, విచారంలో జలప్రతిబింబితకాదంబినీచ్ఛన్న సంధ్యాకాంతుల్ని, రౌద్రంలో భయంకరకాలాహిఫణా ప్రజ్వలిత రత్నాల్ని, ప్రేమలో శరత్పూర్ణిమాచంద్ర చంద్రిక కాంచలస్వచ్ఛనర్తనాల్ని పోలుతవటగా? అయితే ఏం! నాకు నిన్ను చూస్తే ఈ అసహ్యం ఎందుకు?'' అని నరపతి అడిగాడు.

ఆ బాల మాటాడలేదు. "నీ పీ మృదువైన దేహంతో నీ కులికిపోయే వయ్యారంతో నిల్చున్నావు. హారాలతో వెలిగిపోతున్న నీ కంఠాన్ని ఈవేళ్లు నలిపివేస్తే ఏంచేస్తావు?'' ఆ అబల ఒక అడుగు వెనక్కి వేసింది.

"ఉస్'' అని నరపతి ఆ పీఠము పట్టుదిండ్లపై ఒరిగిపోయాడు. ఆతని కర్కశహృదయంలో ఏదో తీరని వ్యథ!

పసిపిల్లలా నరపతికి హేయపదార్థములు. ఆతడు రాజ్యాలలో సంచరిస్తూఉంటే పసుగులు కంటబడకూడదు. ఏ తలిదండ్రులైనా, నరపతికెదురుగా పోనిచ్చారా ఆ తలిదండ్రులకు నూటఇరువది కొరడా దెబ్బలు; ఆ శిశువుకు ఒక చిన్న బెత్తపు కొరడాదెబ్బ!

ఆ నరపతిరాజ్యంలో ప్రజలకి అతడంటే భయం. పరాయిరాజ్యాల్లో ప్రజలకూ ప్రాణభయమే. ఏ మిడతల దండులా, ఏ మహామారిలా సైన్యాల్తోవచ్చిపడతాడో అని భయం. ఎంతదూరంలో ఉండే రాజ్యాలవారికూడా.

# 5

అతడు సర్వశాస్త్రాలు మూలబెట్టాడు. సంగీతాది మనోహరకళలు మటుమార్చాడు. సభలు, రాజ్యాంగ మంత్రాలోచనలు మరిచేపోయాడు. మంత్రులంటే అసహ్యము. రాజపశువులు మోసే అందలం ఎక్కడం సైన్య శిబిరంలోకి పోవడం, వాళ్ళతో మాయాయుద్ధక్రీడలు సలుపుతూ ఉండడం—అదే అతనికి నిత్యక్రీడ.

మళ్ళీ దిండ్ల మీదనుంచి లేచాడు. "ఓ బాలికా! నేను చేసిన మహాయుద్ధాలోకెల్ల ఉత్కృష్టమైన రణరంగములో, నాశక్తి ఎవరునూ ఆరీతిగా కదల్పలేకపోయినటువంటి ద్వంద్వ యుద్ధములో, నీ రాజ్యసైన్యాలు, నీతండ్రి సహాయనృపతుల సైన్యాలు — ముప్పదినాల్గక్షౌహిణీల్ని, నీతండ్రిని ఓడించి నిన్ను చెరపట్టుకువచ్చా.

ఏమిటి నిన్ను తీసుకువచ్చినలాభం? అచ్చరలకన్న అందకత్తెలని చెప్పే రాజకన్యకలంటే నాకు జుగుప్స మాత్రమే. నువ్వంటే కోపంకూడాను—. కాని మాటలకే భయపడి వెనకంజవేశావే, నువ్వు నా వేటకుక్కలముందర వేయుటకుకూడా పనికిరావు."

ఆ బాలికకళ్ళు మిరుమిట్లుగొలిపాయి. ఆమె శ్వేత ఫాలము పాటల కపోలము, అరుణములైన పెదవులు కంపించినై. "ఓ నరపతీ! నీకడ నున్నటువంటి కాలేయకరాజ్యాల్లో

ఎట్టి భయంకర శునకాన్నైనా తీసికొనిరానిమ్ము. నన్నది ఏమిచేస్తుంతో నీ కన్నులు పారకిస్తవిగాక!"

తోకతొక్కిన భుజంగంలా లేచాడా నరపతి, సాయంకాలానికి సభ్యులు, తన ధనకనకమహాపట్టణంలోని ప్రజలు, సామంతులు, సైన్యాధిపతులు, అందరూ మల్లరంగానికి రావాలని ఆజ్ఞాపించాడు.

ఏమిది రాజాజ్ఞ? అని అందరూ చేరారు. అత్యంత విశాలమైన మల్లరంగం కిటకిటలాడిపోయింది — జన సమూహాలతో. మల్లరంగంలో యిసుక రేణువులు ఆ అపరాహ్ణసూర్యకిరణాల్లో తళుకుతళుకుమనిపోయాయి

నరపతి తేరిపారచూడజాలని వైభవంతో వచ్చాడు. ఆయుధపాణులైన స్త్రీభటులు పారాయిచ్చే అందలంలో వచ్చింది ఆ బాలిక. ఆ అబలారత్నాన్ని రణరంగంలోకి తీసికొనివచ్చారు. నరపతి సింహాసనం ఆక్రమించాడు. ఆ బాలిక చేతిలో ఒక బెత్తముమాత్రమున్నది.

నరపతి కన్నుల్లో అపహాస్యపు వెలుగులు తిరుగుతూ ఉన్నవి. నరపతి చేతితో సంజ్ఞచేయగానే ఒకవైపునుంచి రాక్షసుడొకడు (ఒక అడవిజాతి మనుష్యుడు) భయంకర రూపంవాడు, జేవురించిన ఎఱ్ఱనిరంగువాడు, మిట్టకోరల వాడు, చిపిజుట్టువాడు, మదించిన దేహంగలవాడు, ఎనిమిది అడుగుల పొడవుగలవాడు. రాతిదిమ్మల వెడద ఎదందవాడు, మిడిగుడ్లవాడు గట్టి బంగారపుగొలుసుతో ఒక శునకాన్ని పట్టుకొని రణరంగంలోకి దుమికాడు.

# 6

మంచుకొండలకి ఉత్తరంగా సోమేరు, మహామేరు, సుమేరు అను పర్వతాలున్నవి. మహామేరువే పశ్చిమ ద్వీపాల పర్వతపంక్తులకు, భరతఖండ, ఉత్తరదేశ, యక్ష దేశములమహీధరశ్రేణులకు మాతృస్థానము. అక్కడ గాలి చొరజాలని అడవులున్నై. ఆ అడవుల్లోంచి ఒక రాక్షసుడు పెద్దపులికన్న భయంకరమైంది, శివంగికన్న వేగంకలది, ఏనుగులాంటిసత్వంకలది. ఒక మృగదంశకమును తీసికొని వచ్చి, ఆ నరపతి గాంధారదేశంలో గండుతో విడిచివున్నప్పుడు అతనిఎదుటకు వచ్చి నిల్చాడు.

"ఓ యెకిమీడా! నువ్వు నన్ను మల్లముష్టియుద్ధాల్లో గెలిస్తే నేనూ, సింహాన్ని చంపే నా కుక్కా నీకు బానిసల మౌతాము. నేను గెలిస్తేనువ్వోడిపోతావా? నీరాజ్యాల్లో నాయిష్టమైనట్లు ఒక నెలదినములు వుండి, నా అడవులకు పోతా" అని రాక్షసుడన్నాడు.

ఆ మానవుణ్ణి ఎగాదిగాచూశాడా నరపతి. వీరులతో యుద్ధంచేయడమే నరపతి జీవితము. సేనానాయకు లెవరికి యిష్టంలేకపోయినా, వాళ్లు నరపతికి ఆలోచన చెప్పలేరు. నిమిషంలో వాళ్ళప్రాణంలేదన్నమాటే. శార్దూలచర్మపు టోరుకంతో ముందు కురికాడా నరపతి. భుజాస్ఫాలనం చేస్తూ మదపుటేనుగుల్లా, ఉన్నతపర్వతాలవలె, రెండుసముద్రాల్లా, వాళ్ళిద్దరూ ఒక యామం పోట్లాడారు. రాక్షసుని బలం, అనంతబలపూర్ణుడైన నరపతి జవం, యుద్ధనైపుణ్యము

అతి విచిత్రము. రాక్షసుడు ఆయాసపడిపోతూ ఉన్నాడు. నరపతి బలమంతా కూడబెట్టుతూ ఉన్నాడు. ఒక్కసారిగా మెరుములా, రాక్షసుడు ఒళ్ళు తెలియని అడవిదున్నపోతులా, రెండుగుప్పిళ్ళు పైకెత్తి తన విరోధిశిరము వ్రయ్యలుచేయడానికి ఉరికాడు. నరపతి అంతకన్న అతివేగంగా, కండలు కట్టిన ఎడమచేయి, తలపైకెత్తి ఆ రెండు దెబ్బలు అందుకొని, కుడిచెయ్యిగుప్పిటతో పిడుగులాంటి ఒక సమ్మెటపెట్టు ఆ రాక్షసునిముఖంపై ప్రయోగించాడు. రక్తంకక్కుకుంటూ ఆ రాక్షసుడు పడిపోయాడు.

.... .... .... ....

ఆ రాక్షసుడు కుక్కతో రణరంగంలోకి వురికి, ఆ బాలికను ఎగాదిగా చూసి, ఆ బంగారుగొలుసు విప్పాడు. నవ్వే పెదవులు ఆమెఅందాన్ని ఇనుమడిస్తూవుండగా, ఛంగున తనమీదికి కోరలు తెరచి వురికిన ఆ భైరవానికంటె అమితవేగంతో ఆబాలిక, పైకితప్పుకొని తన చేతిబెత్తముతో ఆ కుక్కముట్టెమీద అగ్నిశిఖలాంటి ఒక దెబ్బ చురుక్కుమనిపించింది. ఆ జాగిలం బాధచే ఉరుములాంటి అరపు అరిచింది. కోపంతో వెనక్కు తిరిగి, ఆబాలికపైకి ఉరక్కుండానే పరుగునవచ్చింది. ఆ బాలికమోముపై నవ్వులేదు. మహాశక్తి తాండవ మాడుతోంది.ఆమె చేతిబెత్తంమేఘాల్లోమెరుపైంది. ఆ సారమేయసింహముమొగముచుట్టూ ఆ బెత్తం జవజవలాడించింది. ఆ కుక్క ఏమీతోచక ఒక ముహూర్తము చైతన్యరహితమయింది..

ఇంతటిలోకే చురుక్కుమని సన్ననిబెత్తపుదెబ్బ సరిగ

కుక్క కళ్ళపై తగిలి కళ్ళు మూతపడిపోయినవి. కెవ్వుమని ఆ సారమేయపతి నేలపై మూతిమోపి, హృదయంకరిగే అరపు అరచినాడు. ఉరుమువంటి దానిగొంతుక కరిగిపోయింది.

ఆ శునకరాజము భయపడిపోయింది. ఏమియుతోచక తాత్కాలికంగా గ్రుడ్డిఅయిపోయినకళ్ళతో నిల్చింది. దానిడొక్కలు, దేహము వణికిపోయాయి. ఆ బాలిక ఆ బెత్తము పారవేసి, అత్యంత మాధురీస్వనాల్తో ఆ కుక్కదగ్గిరకుపోయి, దానితల తన వొడిలో ఉంచుకొని, దానిచెవిలో మాటలు చెప్పసాగింది. దాని ఒడలు తుడిచింది. దానికళ్ళు ఒత్తింది. నీళ్ళు కారుతూవున్న కళ్ళువిప్పిందాకుక్క. బాలిక మొగం చూచి బొంగురుధ్వనితో ఆమెమోము నాఘ్రాణం చేసింది. తన్ను ఓడించిన ఆ బాలిక్కీ, ఆ కుక్కకూ ప్రాణ స్నేహం కుదిరిపోయింది. ఆ బాలికచురుకువాటులతో ఆ శునకరాజముయొక్క కరకుతనం మటుమాయమైపోయింది. నీళ్ళు సుడితిరుగు కమలనయనాలతో ఆ బాలిక ఆ కుక్కను ముద్దుపెట్టుకొని కౌగలించుకొంది.

ఆమె జవ్వన నిలబడి ఆ నరపతిదిక్కుచూచి "నరపతీ! నువ్వు మహాబలవంతుడవట; మహా ఖడ్గ కృపాణ యుద్ధాల్లో ప్రఖ్యాతి నందినావట; నీకు నువ్వే సాటట. నువ్వు ఓడించినావని గర్వపడుతూవున్న మాతం్డిగారే నాకు గురువు. నేనూ సమస్తాయుధాలు అవలీలగా ఉపయోగించే కౌశలముకలదాన్ని. నీవువీరుడవైతే నాతోకరవాలయుద్ధానికి రమ్ము. నువ్వు మహాబలవంతమనుకొనే ఈ సారమేయము నాకు ఓడిపోయినది. దీనికిన్నీ దీని స్నేహితుడగు నీ రాక్ష

సునకున్నా పతినైన నిన్ను నేను ఓడింపేయగలను” అని కాంతులమెరిసే చూపులు వెదజల్లుతూ ఆ బాలిక అన్నది.

ఆ నరపతికి కోపంవచ్చింది. ఆ బాలికను ఆపాద మస్తకం చూచాడు. సింహాసనాన్నుంచి రెండంగల్లో ఆ బాలిక దగ్గరకు వచ్చాడు. అతనితోపాటు సామంతులు, మంత్రులు, సేనాధికారులు, ఉద్యోగులు, సభ్యులు, ప్రజా సమూహం అందరూ లేచారు.

ఆ నరపతి బాలికభుజం పట్టి, తీక్ష్ణంగా ఆమెమోము చూశాడు. ఒక్క పెద్దనవ్వు నవ్వాడు. తన అంగరక్షక బలాధికారికి తనకరవాలం తెమ్మని ఆజ్ఞ యిచ్చాడు.

సింహాసనము ప్రక్క ఆయుధపీఠముమీద వుంచిన నిశిత —కరవాలము— రత్నాలుపొదిగిన బంగారుపిడిగలదాన్ని కన్యాకుబ్జములో ప్రఖ్యాతివహించిన ఒక మహాసిద్ధుడు రచించినదాన్ని, ఓటమిఎరుగని ఆయుధరాజాన్ని తీసి, ఆ నీరెండలో ఝుళిపించాడు.

ఆ బాలిక ఆ అంగరక్షకబలాధికారిని పిలిచి అతని చెవిలో ఏదో ఒక రహస్యం చెప్పింది. అతడు నరపతి అనుమతితో రాజాంతఃపురముండుచోటికి పోయి, అక్కడ ఈ బాలిక చెలికత్తెయైన ఒక అంగనదగ్గిరవున్న ఒక పొడుగు పాటిపెట్టె కొనివచ్చి ఆ బాలికముందిడెను. ఆమె ఆ పెట్టె నొక మీట నొక్కి తెరచి, అందుండి పట్టుసంచిలోనున్న ఒరగలకరవాలము నొకదాన్నితీసింది. ఆ వరనుండి సునాయాసముగా కరవాలము పైకిలాగి యుద్ధసన్నద్ధయై నిలిచింది. ఆ వంకరకత్తికి దంతపుపిడియే వున్నది. ఆ కత్తిపైయిరువై

నాలుగు అథర్వణవేదమంత్రాలాయున్నవి. ఆ కరవాలముపూర్వ కాలాన చంద్రుని హస్తాన్ని వెలిగిపోయేదని ఋషులు చెప్పు కొంటారు.

ఆ నరపతిక్రూరనేత్రాలు ముడుచుకుని, నలకలై, తీక్ష్ణసూక్ష్మాగ్నులై పోయాయి. ఆ బాలిక మోము శక్తి పూర్వకమైన హాసచంద్రికలు వెదజల్లుతూనేవుంది. వారిద్దరు యుద్ధం ప్రారంభించారు. సూక్ష్మకౌశలము కొంతచూపించా డా నరపతి. ఆబాలిక వానివన్నిటినీ నడుమనే విరిచింది.

ముందున్న ఎడమకాలు వంచి, కుడికాలు మనో వేగాన్ని ముందంజగావేసి, అడుగునుంచి ఎదుటి ఆయుధాన్ని తన ఆయుధంతో, మెరుములా పైకికొట్టి, ఆమెలికే క్రింది వంపుగాత్రిప్పి, కత్తిపిడిపట్టిన ముష్టియొక్క బొటనవేలిని పొడుచుటకు వరాలకమని పేరు. ఆ నరపతి ఆమెను అమిత వేగాన నిరాయుధగా చేయుటకని ఆ నేర్పుచూపగానే, ఆమె నవ్వుచు అతనికన్న అద్భుతమైనవేగంతో, దానికి మారు ఎత్తువేసి తప్పుకొనుటేకాకుండా, శూలవారియను పేరబరగు మెలికతో తన కరవాలము ఆతనినొసటకు సూటిపెట్టింది. మహా కౌశల్యంగలిగినవాడగుటచేత ఆ నరపతి అత్యాశ్చ ర్యంతో చంగున వెనుక్కు దుమికినాడు.

అక్కడనుంచి ఖంగుఖంగుమని కత్తులమోతలతో, చక్రుమను రాపిళ్ళతో పన్నెండు ముహూర్తములకాలము వారిద్దరు ద్వంద్వసమరం చేసినవారైనారు. కొంతకాలము ఆ బాలిక మహాశక్తియైనది. పక్కపోటులు, అడ్డకోతలు, నిలువు తలు, మెలికలు, వంపులు, మలుపువేటులు, జడివానలోని

చినుకుల్లా ఆ నరపతిచుట్టూ వర్షింపజేసింది. వేటుకు అడ్డు పాటువంపుకు నిలువు తెంపు. మెలికకు జ్రుగన వాలుక, తీతకు పదునువేత, వీటితో ఆ నరపతి ఒక్క అడుగె ఒక్క అడుగే వెనక్కు తగ్గుతో ఏమరుపాటుకాని చూపుతో కాపాడు కుంటూ ఆ రంగంచుట్టూ మూడుసార్లు తిరిగాడు. విచిత్ర మైననేర్పుతో నరపతి ఒక్కగంతున నూతనగతులు ప్రారం భించి, అంతకన్నను మఱియు మంచివిన్నాణంతో తన్ను రక్షించుకుంటూ బాలిక ఏటుకు ఏటు, పాటుకు పాటు, కోతకు కోత బదులిచ్చుచు వెనక్కి తగ్గినది.

ఆ పోరాటము ఇంకను పది ముహూర్తములు సాగినది.

# 7

ఏ వేగానవచ్చిందో, ఏ మెరుపుతోవచ్చిందో ఒక అతి సున్నితమైన వజ్రఘాతమువంటి పొడుపు! ఆ బాలికకు హృదయముకడ గాయము; చేతిలో కత్తిపట్టువీడి నవ్వుతో కళ్ళుమూతపడ, "ప్రభూ! నువ్వు విజయం గాంచినావు సుమీ!" అని అంటూ దిగజారి రణరంగంలో పడిపో యింది. ఆమెగుండెలనుండి చివ్వున రక్తపువెల్లువ వెడలి వచ్చినది.

ఆ నరపతి వెఱ్ఱివాళ్ళా చూశాడు అటూఇటూ. పడి పోయిన ఆ మహారాజుకుమారిత—ఆ వీరకన్యకవైపు దృష్టి పోనిచ్చాడు, అతనికేమిటో మతిపోయినట్లయింది ఒక్క

సారిగా. తన్నెదిరించిన ఈ తుచ్ఛబాలిక కూలిపోయింది కదా! అని సంతోషాన నిట్టూర్పుపుచ్చాడు.

చెలువల మెరుపై, కారుమబ్బుల్లోంచి వెలిగిపోయే చంద్రకిరణాలదండై, సడలిపోయిన పూలదండలా ఉన్న ఆ బాలికమోము చూశాడు! తనకత్తి విసరి పారవైచి, చటుక్కున వంగి, ఆ బాలికను ఎత్తుకుని తన హృదయానికి అదుముకొన్నాడు. ఆ నరపతికళ్ళు నీటిసుళ్ళు తిరిగినవి. "ఎంతటి రాతిగుండె మనిషిని ఈ దేవి పాదాలధూళి తాకుటకయిన అర్హుడనుకానే! తుచ్ఛహృదయంతో,— నా ప్రాణానికి ప్రాణం, నా ఆత్మకు పరమేశ్వరియైన నా దేవిని కరకుపిశాచివలె నరుకుకొన్నాను.—దేవీ! ఒకసారి కనులుతెరువవా! మూఢుడైన ఈ పాపిని క్షమించవా?" అని వడకిపోవు కంఠధ్వనితో విలపించాడు.

... ... ... ... ...

మేఘాలతోనిండిన రాత్రిలో ఉదయం ప్రవేశించినట్లా బాలిక కన్నులు విప్పినది. వర్షపు చినుకులతో నిండిన పూలపై ఉదయారుణ కమలకాంతకిరణాలు ప్రసరించినట్లు, ఆమె పెదవుల నవ్వులు ప్రసరించాయి.

"ప్రభూ! ఇప్పటికైనా మీ హృదయం కరిగిందా? ప్రేమించిన నా ప్రియఝుకీరాసి, కర్కశశిలాచ్ఛాదితం అయిఉన్నదని నాకు తెలుసును ఆత్మేశ్వరా!" ఆమె మాటలు ఇంకను అస్పష్టమైనాయి. "ప్రభూ మీ కఠిన హస్తాలు నా పూల పా—ను—పు!" అని ఆమె కన్నులు మూసుకొని మూర్ఛపోయింది.

అతనిచేతులలో దివ్యవరంలా, అమృతకలశిలా, రూపంతాల్చిన పరమమోక్షంలా ఉన్న ఆ బాలికనుదురు పెదవులతో స్పృశించి ఆ నరపతి కన్నులెత్తి "నేను లేరనుకున్న సర్వదేవతలారా! నాకు మీచే ప్రసాదింపబడిన ఈ మహాయజ్ఞ ప్రసాదాన్ని మీరే తరలించుకుపోకుందురుగాక!

"ఓ విశ్వాలనునిండిఉన్న ఇంద్రమిత్రావరుణులారా! ఈ మీ దివ్యవరమైన అమృత రహస్యాన్ని ఈ మీ నూతన భక్తుడు అంచులు మాత్రమైనా సాన్నిధ్యంచేసుకోకుండా మీరు తరలించుకుపోకుందువుగాక!

"ఓ సర్వజగజ్జీవుల ప్రియబంధువైన శమనుడా! మృకండసుతుని నువ్వు చేకొనిపోలేనియట్లు నా యీ ఆత్మశక్తి రూపాన్ని తరలించుకుపోకుందురుగాక!"

ఆతని ఆర్తనాదము గజేంద్రుని గాఢదీనాత్మికమైన మంత్రమైనది.

ఆ బాలిక అతనిచేతులలో కదలినది. ఆతనిచే ఆ బాలిక సింహాసనంపూద పరుండపెట్టబడినదాయెను. ఓ నరపతీ! నువ్వు లోకాలను హింసించినవాడవు. నేడు ఈమె సాన్నిధ్యంలో ప్రజాదాసుడవై పోయినావు.

ఓ నరపతి! నువ్వు లోకదుఃఖాన్ని కర్కశత్వాన్నీ నీ లోచనాలనుండి ఇంద్రప్రయుక్తమైనవజ్రము మేఘాలను కరిగించునట్లు, నీ తీక్ష్ణబాధచేత కరిగించి ప్రవాహాలు కట్టించినావు.

ఆ నరపతి నూతలా ఆమెస్తనవస్త్రము సడలించినవాడాయెను.

ఆ నరపతి దెబ్బతిన్న హరిణమాతను చూచిన శాబకంలా వణికిపోయినాడు.

వెంటనే అపరధన్వంతరివంటి మహాఋషి ఆబాలికను సమీపించి గాయము పరిశీలించి, హృదయము తప్పి దిగువగా జారిపోయిన ఆ మహాగాయాన్ని ఓషధులచే కట్టుకట్టినాడు.

# 9

శీతతమస్సులు వీడి హిమళపూరితమైన వసంతమున వనవృక్షశాఖాంతరాల నునురెమ్మలుగా, కషాయకిసలయాలుగా ఉదయించింది,

ఉషస్సులోని మత్తు సడలి నూత్న సృష్టి జలజలలాడుతూ పొంగివస్తున్నది.

ఆకాశాన తెల్లని రాయంచజంట. చిగురు గుబురులలో పికద్వయం. సరస్సులో కమలంపై లేత సూర్యకిరణం.

ఆ నరపతి ఆ బాలికమానవత్వపీఠమందు ఉదయపూజోపవిష్టుడై.

—o—

# వాన

"ఎల్లి జగ్గాయిపేట యెన్నంగ నేను పోతే
యెగరేసి వలపులు జల్లే దూడమ్మా, దూడ, దూడా
సిగదీసి కొప్పుపెట్టీ, సిందూరం బొట్టుపెట్టీ
నా అందం నవ్విపోనూ దూడమ్మా, దూడ దూ.
రంగూరంగూలదూడ, పొంగుతూ ఎగిరే దూడ
కాళ్ళగజ్జెలదూడ, గంతూ చంగూలదూడ.
దూడమ్మా, దూడ దూడా, దూడమ్మా, దూడ
దూడా!!"

ఈ పాట వానచినుకులశృతిలో కలిసిపోతోంది. చిన్న ఇల్లూ, చుట్టూ చిన్న ఆవరణ, ఆవరణచుట్టూ తాటాకుల దడి. ఆ దొడ్లో ఉన్నవన్నీ పాదులు, పాదులమధ్యను బంతి చెట్లు, చెట్లపై బంగారు ముద్దపూలు. గుడిసె గుమ్మంలో నీలాలు కూర్చునిఉంది.

జుట్టు దువ్వుకోదు. బుక్కా రంగయ్యదగ్గర కొన్న కుంకుమబొట్టుమాత్రం సూర్యబింబంలా ఆమె నీలఫాలాన ఉదయారుణకిరణాలు వెదజల్లుతూ ఉంటుంది. వెడదలైన ఆమె కన్నుల్లో నవ్వులేదు. కంటికిపెట్టిన కాటుక, కన్నీటితో నున్ననైన ఆమెచెక్కులమీద మరిన్ని నలుపురంగులు రచించింది.

ఆమె కూర్చున్నమూర్తిలోనే అతిదీనత్వం అలుముకొనిపోయింది ఆమెగుండెలో గాథ కనుపులో చెయ్యేసి

కలిశేసినట్లయి, నిదరల్లె ఆమెబళ్ళు నీరసిస్తోంది. బిగువై, సుందరమై, పూర్ణమైన నవయౌవనంలో తీరనిఆవేదన సర్వమునూ శుష్కింపచేస్తున్నది.

తీయని తన మధురకంఠం జీరవోవ ఆమె పాట సాగించింది.

అద్దరూపాయిపెట్టి అద్దాలరవిక కొంటే,
రవికన్నా చిరగలేదే దూడమ్మా, దూడ దూడా
కోటప్పతిరణాలెల్లి కోరిన సవరం తెస్తె
కొప్పన్న మాయలేదే దూడమ్మా, దూడ దూడా!
మూడురూపాయలెట్టి ముత్యాలపాపటబొట్టు
బొట్టన్నా చెరగలేదేదూడమ్మా దూడా!

ఆమెజీవితమంతా నిండిపోయినాడు ఉప్పరి నాగన్న. నాగన్న పొడుగాటి కోరతలపాగా అందగాడు. గిరజాలు, పెద్ద ముడిజుట్టు. కారు నల్లరాతిబండల బలంతిరిగిన వయసు కాడు. వెండిబిళ్ళలతాడు. బంగారుమురుగులు, బంగారు దండకడియం, ఎడమచెయ్యి పైభాగంలో మాయపచ్చ. బిందువు వేలాడు బంగారుపోగు, ఎర్రరాళ్ళ తమ్మెంట్లు. శుభ్రమైన ముదుకపంచి ఎగదోసి కట్టుకొన్న పనితనం.

ఈలా, తనకు మొదటిసారి ప్రత్యక్షమైన నాగన్న అద్భుతరూపం నీలాలకళ్ళల్లో మెఱపుమెరిసింది. ఆనాడు అతగాడు పాటపాడుతూ తన తండ్రిగారిపొలంలో తనకు తారసిల్లాడు.

"బెజవాడ చిన్నదానా, బాజూ బందూలదానా.
బాజూబందూలమీద, మనసేల లేదే ఓచిన్నదానా,

తన్ను చూచి అతను ఆగాడు. పాట ఆపాడు. నీలాల గుండె కొట్టుకుంది. పైకుబికి రానివ్వకూడని రహస్యభావాలు ఆమెలో ఎక్కడో పెద్ద ఏరులా బయలుదేరినవి. బిగువుగా తొడుగుకున్న పీఠరవిక క్రింద స్నిగ్ధాలై వర్తులవలై బిగువైన ఆమె వక్షాలు రవికఖైదును పగులకొట్టి బయటికి వచ్చినట్లయినవి.

కమ్మని రంగురంగు నేలలున్న భూదేవికి వారు అనుగు బిడ్డలు. వారిపెద్దలు, ఆ కన్నతల్లిలోని ప్రేమను చూరగొన్న ఉప్పుగులు, నల్లరేగడులు, ఎర్రచెక్కలు నీలెకుప్పు ఒండ్రు బంగారాలు, తెల్లని గండ్రయిసుకలు, బంగారు సన్నఇసుకలు నిండిపోయిన ధూళిరంగు చౌటిపర్రలు వారి గునపాలచే పారలచే మధింపబడ్డవి.

భూదేవిలోని రహస్యాలు, ఆమెకర్కశత్వం, ఆమెలోని కరుణ వారికి తెలియునట్లు ఇంకొకరికి ఎట్లు అవగతమవుతుంది. ఆమెలోని రసజ్ఞత్వము వారు సూతులుకట్టి పైకి తెత్తురు. ఆమెలోనిమహదైశ్వర్యము గనులుదింపి లోకానికి అర్పింతురు. ఆమె దివ్యప్రేమను కాలువలు త్రవ్వి దేశదేశాలు ప్రవహింపజేతురు. గుళ్ళుగా, గోపురాలుగా భూలక్ష్మికి నూతనాలంకారాలు వారు సమర్పింతురు.

భూసంతానమైన వారిబడలు సకల సుగంధాలను మలయానిలునకు అర్పిస్తూ ఉందురు. అందానికి మూలమైన విశ్వంభరానిధినుంచే వాళ్లు సకల సౌందర్యాలను సేకరింతురు.

ఆ ఉప్పర్లకులంలో వాళ్ళిరువురూ ఉత్తుంగశిఖరాలు.

ఆమెచూపులు ఆతనిపై; అతని చూపులు ఆమెపై; చూపులలో చూపులు కలిసినవి. అతడు మదించిన యౌవన సింహము; ఆమె నూత్న తారుణ్యశోభావతియైన ఆడ సింహము! ఆమెనుచూచి అతడు అనుకున్నాడు.

"పలకనైన పలకవే పంచదార చిలకవే"

అతనిని చూచి ఆమె అనుకున్నది.

"ఓరోరి! నా బావ, ఒయ్యారి నా బావ!
మబ్బుల్లోంచి దిగివస్తావా! మాయదారి నా బావ!
మబ్బుల్లోంచి, దిగివస్తావా!"

## 2

ఒక పెద్దజట్టుకు నాయకుడై, అయిదెకరాల మాగాణికి, ఆరెకరాల మెరకకు భూపతియై, సాలుకు రెండువందల యాభై రూపాయల ఆదాయంరాగా, మెరకఊళ్ళలో ఏ నుయ్యో, పల్లపుఊళ్ళలో ఏ చెరువో త్రవ్వకంట్రాక్టు పుచ్చుకొనిగాని, ఏ రోడ్లు బాగుచెయ్యడమో, ఏ క్రొత్త రోడ్లు వెయ్యడమో బోర్డు కంట్రాక్టరువద్ద త్రవ్వపని ఒప్పుకొనిగాని సాలుకు వందరూపాయలు పైగా సంపాదించే, హనుమన్న తనకు ఏకైకపుత్రికయైన నీలాలుకు మంచిసంబంధం తీసుకురావాలని ఊళ్లూ నాళ్లూ గాలించి వెదికాడు. ఏరుదాటైనా ఇంటికి వచ్చిన పశువును తెచ్చుకోమని—తనజిల్లా దాటి, వేరుజిల్లాలకు వెళ్ళి, ఒక జట్టుకు నాయకుడై, నాలుగు ఎకరాల మాగాణిభూమిమీద సాలుకు నూటయాభై రూపాయల ఆదాయంకలవాడునూ, అందగాడునూ, త్రవ్వపని

వల్ల సుమారు నూరురూపాయలు ఆదాయము తెచ్చుకొనే వాడున్నూ అయిన నాగన్నను అల్లుడుగా ఎన్నుకున్నాడు హనుమన్న.

పెళ్ళయి క్రొత్తగా అత్తవారింటికి వచ్చిననాటి సంగతులన్నీ జ్ఞాపకానికి తెచ్చుకుంది నీలాలు—

నాగన్న భార్యనుచూచి ఉప్పొంగిపోయాడు. తన అందానికి తగిన అందాలపడుచు. పొద్దస్తమానాలూ ఉప్పొంగిపోతూ పాటలు పాడుకొనేవాడు—

"చిన్నదాన, చిన్నదాన, వన్నెల వలపుదాన!
కన్నుల నలువుదాన, పన్నుల తెలుపుదాన!
చిన్నారి సిగ్గుదాన, యెన్నెల యెనుగులోన
తిన్నంగ తేలిపోదాం ఓ సిన్నిదానా!
ఓ సిన్నిదానా!

అని నీలాలుని సందిట్లో బిగించుకొని, వెన్నెట్లో, ఇంటిదగ్గిరనుంచి ఉప్పుటేరుకు తీసుకుపొయ్యేవాడు.

"నీకు నాకూ జోడుఐతే మల్లెపూల తెప్పగట్టి
తెప్పమీదా తేలిపోదాం పదవే
చల్ చిన్నారిపడుచా తెప్పమీదా తేలిపోదాం పదవే"

సిగ్గుతో నీలాలు అప్పుడు ముసిముసినవ్వులు నవ్వుకున్నది. నాగన్న మెడచుట్టూ చేతులు గట్టిగా బిగించి, అతని వెడదయైన రొమ్ములో తనమోమును గట్టిగా అదుముకొన్నది.

"ఏటే ఆలోసిస్తున్నావు? ఈపళంగా పడవఏసుకొని మన మిద్దరమే ఎల్లిపోతావుంటే నీ మొగంసూత్తూ అంతా మరిసిపోయి, ఏళ్ళు ఏళ్ళు గడిపేసుకోగల్ను"

"ఏరంటే నాకు బయుంవత్తది బాబూ!"

"మరి యూవంటే భయుంలేదు?"

"నువ్వంటే బయుంలేదు"

"అల్లాగా! సూత్తావుండు. ఎమికలు ఇరిగేటట్టు నాక్కేత్తా. ఆ బుగ్గలుకొరికేసి తినేత్తా. నేను పొలంఎల్లి వొచ్చేటప్పటికి కూడొండకపోతే చెమడాలెక్కనాగేత్తాను."

"నువ్వు పొలంఎల్లి వొచ్చేటప్పటికి బొచ్చిచేపకూర వొండి సిద్దంగావుంటే నన్నేం సేస్తవు?"

"ఏం సేస్తనా! కడుపునిండా చేపలకూరేసుకు తినేత్తాను. నిన్ను హాంఅని మింగేత్తాను."

"ఓ సబ్బా! నాకు బయుమేటి? నీ కడుపులోనే నేను దాక్కుంటేను"

"నాకడుపులోంచి గుండెల్లోకి పోతావేంటే నీవ్వూ?"

"అవును బావా! నీ గుండెలూ నింపుతా, నీ నిలువెల్లా నిండిపోతా"

"కూరలో నేనుంటె, కూరమింగినేత్తె,
గుండెల్లో చేరుకుని కునుకుతీత్తుంటాను,
నా బావా!"

గుండెల్లో దాగుంటె, కోటిరాజ్యాలేలి,
ఆకాశమంతెదిగి, అందాలుతవ్వుతా,
నా పిల్లా! చందుర్ణ్ణి తెత్తానా పిల్లా!"

# 3

అలాంటి తనదొర, తన రాజు, తనబావను పెద్దరయితు దురన్యాయంగా ఖైదులో వేయించాడు గదా? దేవుడునేడా! అమ్మవోరు నేదా? ఆ ఆలోచనలకి అడ్డంవచ్చాడు, ఉప్పరిసెలమయ్య. ఆ రోజు పొలం ఆక్రమించుకోడానికి పెద్దరైతు వానలోనే పదిమంది పాలేళ్ళతో వస్తున్నాడని సెలమయ్య కబురు చెప్పినాడు—వాననీరు కారిపోతుండగా తుడుచుకొంటూ ఒగర్చుకొంటూ.

ఆ మాటలు వినడంతోటే నీలాలు ఆడ వేటకుక్కలా లేచింది.

"ఒరన్న, గూడెంఅంతా సెప్పరా!" అన్నది. మూల నున్న దుడ్డుకర్రపుచ్చుకొని బయలుదేరింది.

వానజడితో వియ్యమందుతూన్న కంటనీరుమాయమై పోయింది. సివంగిలా ముందుకుసాగి నడిచింది. పొలంగట్టు మీదనుంచుంది. ఇంతట్లో ఒకవైపునుంచిఉప్పర్లు వచ్చారు. మరోవైపునుంచి పెద్దరైతూ అతనిపాలేర్లూవచ్చారు. నీలాలు కళ్ళల్లో ఎరుపులూ, పెద్దరైతుగుండెల్లో చీకటిపొగలూ కమ్మాయి.

"నా పొలంలో ఏ యెదవ అడుగెడతాడో ఆణ్ణి సంకేసి అక్కడే పారేత్తాను." అంది నీలాలు.

పెద్దరైతు మీసాలురెండూ కోపంతోవణికిపోయాయి "ఆడలంజకి ఎంతపొగరూ? దీన్ని మొగుణ్ణి పొగరణచినట్లు దీన్ని అణచాలి. ఈయాళికిఊరుకొంటున్నాను. రేపొద్దున్న

అడ్డంవచ్చావా, పదిమందిలో నీ సీర వొలిచి వోతలేయిస్తాను" అని అరపు అరిచాడు.

"ఒరి చచ్చినాయనా! దొపదమ్మగారిసీర వొలిచిన యదవరక్తం ఆమె బత్తబీముడు తాగాడుగాని, నీ రక్తం నేను పుడిసిళ్ళ తాగనుట్రా" అంది నీలాలు. నీలాల్ని కన్నెత్తిచూడలేకపోయాడు పెద్దరైతు.

పాలంగట్టునఉన్న ఉప్పరినాగన్న ఇంటిలో ఉప్పర్లందరూ ఆ రాత్రంతా కూచుని కునికిపాట్లు పడుతూవున్నారు.

జడివాన కురుస్తూనే వుంది.

"నింగీ నేలా ఒకటయ్యాయి
కుంగినాయి లోకాలన్నీ.
పెద్దరైతుకు బుద్దేలేదురా.
ఓరన్నా తమ్ముడ నిద్దరపోరా ఆడీగుండెల్లో
నల్లనేలే పరిమళించే
మల్లిపూలూ మొగిలీ పూలన్నా!
మొగలిరేకే భూదేవి బాకేరా!
ఓరన్న తమ్ముడ!
మొగలిలోన నాగన్న ఆడేలా!"

వాన పన్నీరుపూచే వాసన. నల్లరేగడ పారిజాత పూలవాసన; గరపనేల మంచిగంధంపరిమళం; ఎఱ్ఱచెక్క నేల అగరువాసనా; ఇసుకనేల పెద్దజాజిపూల సురభిళం, రాతినేల లవంగంవాసనా, పట్టునేల సముద్రంవాసనా, సున్నం నేల దాల్చిన చెట్టుపూవువాసనా వేస్తాయి.

ఈ నేలలో వానలు కురిసినప్పుడు కొంచెం మంచి

గంధం కలిపిన ఆ పూ వాసనలు ప్రసరిస్తాయి. వ్యవసాయం చేసినభూమి దున్నినప్పుడు తుంగముస్తలవాసన గుప్పుమంటుంది.

ఈనేలనుతవ్వేఉప్పర్లకు ఈవాసనలంటేఎంతో ఇష్టం.

కాలువలు త్రవ్వి నీరు ప్రవహింపచేసేటప్పుడు వచ్చే సువాసన పూలచెట్లపై తోటమాలి నీళ్ళుపోసేటప్పుడు వచ్చే సువాసన వస్తుంది.

ఈ పరిమళాలన్నీ ఉప్పర్లజీవితాలలో నిండివుంటాయి. నీలాలుకి సుగంధాలు లేవు. మిరపతోటలో వసంతకాలపు జడివాసనే నిండిపోయింది. ఉదయంకాకుండా పొలంలో నాగళ్ళుదింపారు. ఉప్పర్లు దున్నలుకట్టి పొలందున్నేశారు. వాన వారిచుట్టూ! మబ్బులూ వారిచుట్టూ లేకదా! పొలమూ వారూ ఒకటే, ఎవరయ్యా నీలాలుపొలంలో అడుగుపెట్టేది?

## 4

పెద్దరైతువల్ల బాధలుపడ్డ ఒకడు నాగన్నను ఖైదు పెట్టిన, సబుజైలు తాలూకాగ్రామం ఆ రాత్రికిరాత్రిపోయి నాగన్నపేరున పెద్దవకీలు ప్రజ్ఞావంతుడు అయిన వీరాస్వామి నాయుడుగారిని కుదిర్చి, ఆయనసలహాపైన ఆయనదగ్గరకు పోలీసు సబ్ఇనస్పెక్టరుగారిని నావలోనే జట్కాబండిమీద లాక్కునివచ్చాడు, వీరాస్వామినాయుడుగారు కథంతా విన్నారు. ఆయనహృదయం కరిగింది. నాగన్నపొలందగ్గిర అల్లరి జరగకుండా చూడవయ్యా అని సబ్ఇనస్పెక్టర్ని నాయుడుగారు పంపించారు.

నాగన్నవాళ్ళ ఉప్పర్లపల్లె ఒక పెద్దగ్రామానికి శివారు. ఆ గ్రామంలో పెద్దరైతునూరెకరాల ఒక పంపును అంటె నాగన్నమూడెకరాల పంపూ ఉంది. పెద్దరైతుకు ఆ చుట్టుప్రక్కల గ్రామాల్లో అయిదారువందల యకరాల భూములున్నవి. కలక్టర్లే పెద్దరైతు గాదికింద బంగారం తినే మూషికాలు.

నాగన్నపొలం కాలవగట్టుపొడుగునా ఉంది. ఆ పొలం పెద్దరైతు నూరెకరాలపంపుకూ, కాలవకూ అడ్డగాఉంది. తలుచుకుంటే నాగన్న మూడెకరాలలో ఆకుమళ్ళు మిలమిల లాడిపోతూ పోటెత్తుకువస్తాయి. కాలవ వదిలితే అయిదు నిమిషాలలో పొలం తడిసిపోతుంది.

పెద్దరైతు ఈ మూడెకరాలు అమ్మమని కోరాడు. నాగన్న రక్తపుబొట్టులు ధారపోసి కొన్నపొలం ఎల్లా అమ్ముతాడు!

'అమ్మనేను బాబయ్యగారూ' అని మనవిచేశాడు.

ఎంతమందిచేతనో చెప్పించాడు పెద్దరైతు. నాగన్న అందరదగ్గరా 'స్వామే! నా ప్రాణాలా భూమిలో ఉన్నా' యన్నాడు.

పెద్దరైతుకు పంతం వచ్చింది. బెదరించాడు. రెండు రెట్లు ఖరీదిస్తానన్నాడు. బదలాయింపు మంచిభూమి యిస్తా నన్నాడు. నాగన్న పసేమి 'బాబూ! భూమి నా పెద్దబారియ, సిన్నదే నీలా'లని తలపంకించాడు.

"సరే, లమ్డీకొడకా! నీ భూమీ దక్కదు, నీలాలూ నీకు దక్కదురా" అన్నాడు.

నాగన్న కోపంతో వణికాడు. తలవాల్చుకొని తన గూడెంపోయి, నీలాలును తన హృదయానికి అదుముకొని, కంటనీరెట్టాడు.

'ఏంటిబావా! అది' అంది వెర్రినీలాలు. భూదేవి గజ గజలాడింది కాబోలు! ఆ మర్నాడు పెద్దవాన ప్రారంభిం చింది. వానతోవచ్చి నాగన్నను అరెస్టుచేసి తీసుకుపోయి తాలూకాగ్రామంలో ఖైదుచేశారు పోలీసువారు. దొంగ తనం నేరం, మేజస్ట్రేటు దగ్గిర కేసు.

# 5

ఉరుములూ మెరుపులూ. వాన డబ్బాటుతనంవదిలి తుంపరగా మారింది. పడమటివైపున తెరిపికనబడింది.

పుట్టింటికి పోకుండా ఉప్పరి నీలాలు భర్తకోసం అతని యింట్లోనేఉంది. నీలాలింటికి పెద్దఉప్పరిపెళ్ళాం వచ్చి నీలాలుకు ఆసరాగాఉంది.

రేపటివరకు నీలాలుకే భూమి కౌలుకిచ్చి చక్కాపోయారు. నీలాలు మర్నాడు సాయంకాలం వానతెరిపి చూచి, పొలం మదురాకు ఊడ్పిస్తే బాగుంటుందని అనుకొంది.

"ఏకాడ వున్నావు నా బావా!

ఏమి సేత్తున్నావు నా బావా!"

అని అనుకుంది నీలాలు. "చలమయ్యఅన్నను పీడరు గోరిదగ్గరకు పంపినానుకదా! ఇంకా అన్న తనబావ ఊసెత్తుకొని రానేలేదు" అని తనలో మాట్లాడుకుంది.

వెంటనే వెనకాలే వచ్చి ఎవరో కళ్ళుమూశారు.

'యూరది; ఎర్రి వేళాకోళాలు. ఒదిలేయి కళ్ళుమూత్తావేం! ఓరేవడురా! కుంక! చంపేత్తా' శక్తిలా తిరిగింది నీలాలు.

ఎదుట నాగన్న నవ్వుతో, "ఎంత బలం ఉందే నీకు పిల్లా! నా యెళ్ళు రగతం వస్తున్నాయి చూడే!" అన్నాడు.

"నా బావే!" అని ఒక్కగంతున అతనిమీద వాలిపోయింది నీలాలు.

"పీడరయ్యంగోరు బేలుమీద ఇడదలచేయించాడు. ఆర్ని నువ్వే పెట్టించావంటగా? నీ మెడలో బంగారుగుళ్ళ పేరు తాకట్టుయెట్టావంట, నువ్వు మాలచ్చివే పిల్లా!" అని నాగన్న పలుకుతూ, నీలాల్ని గుండె కదిమేశాడు.

వాన తగ్గింది. సాయంకాలం యెండ బంగారురంగులు చల్లిందా కౌగిలింతలో ఉన్న దంపతులమీద.

"ఇద్దారి మనసూ ఏకమైపోతే,
పొద్దున్న సూరీడు ముద్దెట్టుపూలు.
ఇద్దారి బతుకును ఏకమైపోతే
సందేల సూర్యుడు సెంద్రుణ్ణి ఇచ్చు".
భూమి ముసిముసి నవ్వులు నవ్వుకొంది.

—o—

# నాగరాజు

అనగా అనగా ఆంధ్రదేశంలో పినాకినీతీరాన్న, సింహపురి పెరుమాళ్ళదేవాలయమండపంలో ప్రతి సాయంత్రం చిఱుమబ్బులన్నీ కరిగిపోయే దివ్యవీణాగానం వినిపించేది. దేశ దేశాల్నుంచి ఆ అమృతస్వరాలు వినేటందుకు వృద్ధులు, యువకులు నవతుమార పరిమళగాత్రులు, అంతా వచ్చి పులకరాలతో తన్మయత్వంపొందేవారలు. మండపం లోనూ మెట్లమీదను రంగురంగుల వస్త్రాలతో వెన్నెట్లో విరగబడే సముద్రపు కెరటాల్లా చిత్రమైపోయేవారు, కొన్ని నయనాలు నిమీలితములై పాడ్యమినాటిచంద్రవంకలా చెమరించేవి. విస్ఫారితనయనాలు కొన్ని చైతన్యంవదలి బంగారు కిరణాల నీటిలో మఱచి విహరించే చేపలరీతిగా తళుకులాడేవి.

ఆ మండపంమీద సౌందర్యంముద్దపోసిన ఓయావనుడు దంతం, మంచిగంధంతీగెలుసాగిన వీణ మేళవించి, గౌరీశంకరశృంగంపై మంచుమరిగే విమలగాంధర్వం జగన్మోహనం చెసేవాడు. బంగారంఒరిసేఒళ్ళు, తెలుగుపల్లవుల వేంగీపురం—ఏనుగుల కుంభస్థలాల్లాంటిభుజాలు, పర్వత సానువువంటి వెడదరొమ్ము, నల్లటి ఉంగరాలజుట్టు, చిలక ముక్కు, విశాలమైన ఫాలం. ఆ పడుచుపాటగాడు, వీణ—వయ్యారంగా వల్లెవాటు వేసుకొని, చిక్కుడుకాయల్లాంటి వేళ్ళతో తీగెలుసవరించి, మెట్లునొక్కుతూ వీణపాడు

తుంటే, పేరుపొందిన గాయకులు, వైణికులు వినటానికివచ్చి, దినందినం ఆ పట్టణంలోనే నిల్చిపోయేవారు.

సహజసంగీతరసోద్రేకంకల యువజనులు ఆగానిపాటలు విని, ఆయన్ని గురువుగా యెంచుకొని, ఆమోస్తరుగా వీణెలు మేళవించి, ఇళ్ళదగ్గర సంగీతం నేర్చుకుంటూఉండేవారు.

అక్కడికి ఒక పరాయిదేశంమనిషి వచ్చి భయంకరంగా ఆకర్షించే కెంపుకళ్ళతో, ఊగిపోతూ పాట వినేవాడు. ఆతని ఆకుపచ్చని తళుకుపంచెకూడా ఆ సంగీతం వినేటట్లు కనబడేది.

## 2

ఒక సంధ్యాకాలంలో— ఆ వీణాధరుడు హాయిమను కొత్తపాట ఒకటి మోహనమైన గాత్రంకలిపి తీగలపై ప్రయోగించినాడు. సభ్యులందరూ పరవశులైపోయినారు.

చిరునవ్వులో ఆ పాటకాడు అందరినీ చూచి, పరాయిదేశంమనిషిపై చూపునిలిపి, 'ఓ నాగరాజా! నే పాడే ఈ నూత్న ఫణితులలో అపశ్రుతి ఏమాత్రం కలిగినా, ఈ నా కుడిచెయ్యిపై కాటేసి, నన్ను దహింపవలసింది' అని ఆడిగాడు. గుండెలుపగిలే పామునవ్వులో ఆ పరాయిదేశం మనిషి లేదన్నట్లు తలతిప్పాడు. ఒక్కనిమేషం నిర్మల నీలాకాశంవైపు చూపులు పోనిచ్చి కన్ను లరమూతలువడగా, స్ఫటికంలాంటిచెక్క వీణాదండాని కానించి, ఒక్క విచిత్ర రాగం ఆలాపంచేశా డా బాలమూర్తి. కొండపాలాల్లో పరుగులెత్తే వాగుల పాటలు నిశ్శబ్దంలోంచి బయలుదేరినై.

ఉదయం మంచుగుళికలు చెట్ల లేతజిగురుఆకులనుండి క్రింద సెలయేటి నీటిలో తాళంరీతి పడి మారుమ్రోగాయి. వృక్షముల గానమైనది. సాంధ్యరాగాలలో జీరలు పోయి, తీగెలు సాగి, పలవలై తలపుల కలుములైనది. గంభీరసముద్రవీచికల హోరైంది. కథల పాడింది. బుక్కలై ఘనరాగమైపోయింది. సర్వమహామండలాలు ఊగించి, ఒక్కమారాగి, తళుక్కున తారాలోకమై హాయమైంది ఆ పాట.

## 3

ఈ గానాలసుడిలో తన్మయుడైపోయి, ఆ పరాయి దేశం మనిషి కన్నులే చెవిగా విన్నాడు. ఇటునటు తాండవించిపోయాడు.

ఆ సమయంలో, అతనిశిరస్సువెనక మూడు సర్ప శిరస్సులు బయలుదేరాయి. ఆ తలల్లో మణికిరీటాలు పొడసూపినై.

ఆ సమూహంలోంచి ఆజానుబాహుడైన ఒకవృద్ధతపసి లేచాడు. అతనిజడలు పాలసముద్రం ప్రవాహాలైనై. అతని పొడుగాటిగడ్డం వెన్నెల్లో ప్రయాణంచేసే తెల్లని మబ్బయింది. మహాసత్వం తెలిపే తీక్షణదృష్టిలో ఆ పడుచుపాటకుని చూచి 'అబ్బాయీ! కొన్ని మహార్త్రిప్రకీతమౌ నీ పాటలో అపశ్రుతి దోషముందా? నాదానందానికి లోపంఉందా? అని కళాప్రకృతిదోషశిక్షారూ:మూర్తియైన ఈ పాముల రాజు నడిగావు' అని పరాయి దేశం మనిషినిచూచి, "ఓ నగరాజా! ఈ గానగర్వసంగీతములో అతులిత దివ్యానందం

ఏ పక్కనుంచి వస్తుంది? పూర్వసంప్రదాయాలన్నీ త్యజించి, హేయమైన నూత్నశక్తులు సృజించాడు, గాంధర్వస్మృతి దోషుడయిన ఇతనికి మరణమే శిక్ష" అని ఊరుకొన్నాడు.

ఆమాటలకంతా హాహాకారంచేశారు. ఆ పరాయి దేశంమనిషి వణికిపోయాడు. దీనంగా అతనికేసి చూశాడు. తలవాల్చి ఒక నిమేషం ఆలోచించాడు. బుస్సుమని నిట్టూర్పువుచ్చాడు. ఇంతలో ఆ పరాయిదేశంమనిషి క్రోధమూర్తిఅయ్యాడు. చూస్తూండగా, అతడు కరిగిపోయాడు. దేహమంతా, తళుకుతళుకుల పొడలున్న సర్పదేహమయింది. మనిషితల మాయమయింది.

ఎఱ్ఱజీరల నాలుకల ఆడిస్తూ మూడుఫణాలు ఛత్రాలయ్యేటట్లు ఆడిపోయినవి

# 4

తేజస్సునిండినమోములో చిరునవ్వులు తాండవించగా, ఆ బాలకుడు కాటుకై సూర్యకిరణంలాంటి తన చేయి ముందుకుచాపాడు. ఆరుధనువుల పొడవై దేహం ఆడి చుట్టలుచుట్టుకొంటూండగా బుస్సుమని, ఆ నాగరాజు పడగలు వెనకకుపోనిచ్చి, మెరుపులా కాటువేయబోయే చిటికలో లోకాలుకదిపే తీగ పాటలస్వనంలో "ఆగు" అని మాటలు వినబడ్డాయి. ఆ మండపంమీద ఒక స్తంభాన్ని ఆనుకొని దినదినమూ పాట వినడానికివచ్చే ఒకబాలిక దివ్యసౌందర్యగాత్ర పద్మంలాంటి చెయ్యిచాపి, నాగరాజును ఆగుమని సన్న చేసింది. శృతులన్నీ మురిసిపోయే చూపులతో

ఆ తపసినిచూచి, 'ఓ పూర్వసంప్రదాయీ, ఈ కుమారుని నూతన సంప్రదాయము ని పూర్వసంప్రదాయమున కప్రశుతి తీసికొనిరాలేదు. ఈతని కొత్తపోకడలు అద్భుతానందం ఇస్తున్నవి. నీ పూర్వసంప్రదాయముంతా అనేక యుగాలలో, అనేజ కళామూర్తుల కొత్తఫక్కీలతో నిండి వున్నవే. వెనుకటిమార్గముల కేమాత్రము అపశ్రుతిరాని క్రొత్తదారులు ఉత్కృష్టమైనవి. అనేక సంప్రదాయకర్తల వలె ఈ నూతన సంప్రదాయానికితడు మూలపురుషుడు. కళాధిదేవిక అనందాత్మయైన నాకితడీ నూతన కుసుమం అర్పించాడు. అది ప్రేమతో అంగీకరిస్తున్నాను' అని ఆమె వీణపల్లవపాణియై వెలుగుల అంతర్హిత అయిపోయింది.

"ఓ కళాకుమారా! నువ్వనన్యమూర్తివి. నీ పాటలు లోకంలో వెదజల్లు నీదివ్యగీతికానాదం ప్రణయాలు గురియై నది జోలల్లో పాపల నూపనియ్. అనంతసత్వాల అవతరింపనియ్." అని తపసి ఎక్కడికో పోయాడు. ఆ పరాయిదేశం మనిషి, ఇంతలో మాయమైపోయాడు.

—*—

# గుడ్డిపిల్ల

తాడేపల్లిగూడెంస్టేషనులో ఎక్కింది, ఆబాలిక, బెజవాడబండి. కూడా ఒకచిన్నపిల్లవాడు ఆ బాలికచేయిపట్టుకొని దారిచూపుతూ వున్నాడు. చినిగిపోయినగుడ్డల్లో మేఘాల్లో చంద్రుడిలా వుంది ఆమె. ఆమెఅందం ఆమెకే తెలీదు.

“వినవే పల్లవా మృదూ చరణా కరుణా వితరాణా గూణా భరాణా” అని పల్లవి ప్రారంభించింది. ఒక్కసారిగా పెట్టె నిశ్శబ్దం ఆవరించింది. విరిసిన వసంతోదయంలో మల్లికా పుష్పగంధంలా ఆ కిన్నెరస్వరం, మహావేగంతో పరుగెత్తుతున్న రైలుహోరు శ్రుతిగా, ఆ పెట్టెఅంతా ప్రవహించింది.

“జనవీభు డానా తిచ్చిన దంటూకాటవికి” అందరి హృదయాలూ కదలిపోయినవి. కొండచిలువ పెనవేసుకొన్న జింకల్లా, చైతన్య రహితులై వింటున్నారు యావన్మందిన్నీ.

“మునివేషధారినై చదివేదననావీని” ఎవరిభావ గాంభీర్యం ఎంతవుందో ఆ లోతు! విసిలమై నిర్మలమై కాంతి దాల్చింది.

ఆమె తలముడి కంగారుగా విడిపోయి, నీరులేనిమేఘంలా చెదిరివుంది. కళ్ళుచూస్తూవున్నట్లేవున్నవి. కాని సంజ్ఞాజ్ఞానరహితాలై ఎండిపోయిన చెరువుల్లా మెరుస్తున్నవి. తీర్చి

విద్దిన కనుబొమ్మలు, సమమైన ముక్కు, చిన్ననోరు, వణికే పెదవులు ఆమె మోహన సుందర శ్రీ సాక్షాత్కరింపజేస్తున్నవి.

ఆమె పాట ఒక సెలయేరులా మర్మరించింది, రాళ్ళ గుట్టలో జలజలలాడింది. సుడిగుండాలు చుట్టింది. చెట్లనీడ సమతలంలో పోయింది, ఆగింది, ఒక బండరాయికింద మాయమై అవతల తిరిగి ప్రత్యక్షమైంది.

ఆ గానం శ్రావణమాసపు పచ్చికలా అల్లుకు పోయింది. శరదృతుపుష్పాలై వికసించింది. నవవసంతంమల్లే ఆనందపర్వమైపోయింది.

## 2

అప్పుడే ఒకస్నేహితులో ఎక్కడో ఒక బ్రాహ్మణోత్త ముడు. వచ్చిరాగానే ఆపాటకు అడ్డంవస్తో ఒక హాస్యవచనం అన్నాడు. ఆత్మానందం మానవాతీతం కాబట్టి లోతు నీళ్ళల్లో మునిగినవాళ్ళలా, మనుష్యులు ఆ ఆనందం అట్టే సేపు భరించలేరు. ఈ హాస్యవచనం ఒక్కసారిగా ఆపెట్టెలో వున్న మానవలోకానికి నిట్టూర్పు యిచ్చింది. తెప్పరిల్ల జేసింది. ఆ బాలిక పాట మానివేసింది,

కొత్తగావచ్చిన హాస్యగాడు జబ్బుహాస్యంతో ప్రారంభించాడు. తనకు తగని జబ్బున్నాడు. అది తిండిజబ్బు భోజనానికి వెడితే మొగపెళ్ళివారికి చేసిన శాకపాకాలన్నీ తన విస్తట్లోనే మాయమైపోయేవుండేవట. వైద్యుడిది మహారోగం అన్నాట్ట దానికి ఉదమాన్నే మినపసున్ని తాటికాయలంత మాత్రలుచేసి ఒకశేరు తేనెపాకం అనుపానంగా,

ఒక డజను సేవించమన్నాట్ట. ఇత్యాది హాస్యంతో, కోమటి హాస్యం, భావహాస్యం, గొల్లహాస్యం, బుడబుక్కలహాస్యం, కుక్కకూతలు, నక్కకూతలు కుప్పేశాడు. ఆ రైలుపెట్టెలో మనుష్యులు విరగబడి నవ్వారు. కళ్ళవెంబడి అందరికీ నీళ్లు కారినై. డొక్కలు నొక్కుకున్నారు. ఒకళ్ళమీద ఒకళ్లు పడ్డారు. ఎంత హాస్యానికన్నా చిరునవ్వులుమాత్రం వెదజల్లుతుంది హిందూస్త్రీజనం. అక్కడ ఆడవాళ్లు ఒళ్ళుమరచి నవ్వుపొంగుల్లో ఊగిపోయారు. అక్కడనుండి డబ్బువసూలు చేయడం ప్రారంభించాడు. కాన్లు, అణాకాసులు, అర్ధణాలు, రెండణాలకాసులు గళగళ అతని హస్తంలోకి ప్రవహిస్తూ అక్కడే మాయమవుతూన్నాయి. అతగాడు కొంచెం గుంటుపల్లి భాస్కరుడి ఇంద్రజాలంకూడా ఎరుగున్నవానిలా కనబడ్డాడు. ఒక పన్నెండణాలుదాకా పోగుబడిందికాబోలు, అదంతా "హుళాక్కని" తెల్లపోయి చూస్తూవున్న ఒక కుఱ్ఱవాడి లాగులోంచి గలగల రాలించాడు చిల్లరంతానూ. "అమ్మకొంగా" అన్నాడు. పెట్టెఅంతా ఘొల్లుమని నవ్వింది.

"మీరు చల్లగావుండాలి, నేను పచ్చగావుండాలి. మీ ధాన్యాలు నా గాది నిండాలి. మీ నవ్వులోంచి ధనవర్షం కురియాలి. జయీ! విజయీ భవ!! దిగ్విజయీభవ!!! మీరెప్పుడూ రైలుప్రయాణం చేస్తూవుండాలి. బాబూ! సెలవండి" అని తర్వాత స్టేషనులో దిగిపోయాడు. వేరే పెట్టె ఎక్కినాడు కాబోలు.

# 3

ఇంతసేపు ఆగుడ్డిపిల్ల నిర్ఘాంతపోయి నిల్చున్నది. అప్పుడప్పుడు వేళాకోళంమాటలకి చిరునవ్వునవ్వుతుంది. కూడావున్న ఆ పిల్లవాడు పకాలున నవ్వుతూవున్నాడు, హాస్యంపాడుగునా.

ఆ బాలిక. గొంతుకు సవరించుకుంది,

"ఎంతనీ వేడినా, ఎక్కడవుందువో
కంతు జనకరామా!!"

అని హాయిమనే కృతి ఒక్కటి ఆలాపనచేసింది.

ఆ హాస్యగాడిమాటలే పక్కఆయనకి జ్ఞాపకంచేస్తూ విరగబడి నవ్వుకుంటూవున్న ఒకముసలి కమ్మాయన "ఉస్ పిల్లా! వుండు" అన్నాడు.

ఆ బాలిక అల్లాగే నిల్చుండిపోయింది. ఆ పసిపాప డబ్బు అడుక్కోబోగా 'ఛీ, పో, ముట్టుకుంటావు; చిల్లర అయిపోయిందిరా!' అని వరసగా అంటూనే వున్నారు.

ఆ బాలిక అలాగే చైతన్యరహితంగా నిల్చునేవుంది. రయిలు కదిలిపోతూనేఉంది.

ఆరుకాన్లు వసూలయ్యాయి. ఆ అంధబాలిక జ్ఞాన శూన్యాలైన కళ్ళల్లో వేడినీళ్లు తిరుగుతునేఉన్నవి. ఆమె నిర్మలహృదయం మాటలేని ఏడుపులో సుడితిరిగింది. పిల్ల వాడు వచ్చి ఆ అణాన్నర ఆ బాలికచేతులో పెట్టాడు. ఆమె. మొహంవంక తేరిపారచూశాడు. ఆమెచెయ్యిపట్టుకున్నాడు. వాడి లేతమనస్సు చివుక్కుమంది. వాళ్ళఇద్దరకూ ఒకళ్ళ హృదయం ఒకళ్ళకి విస్పష్టమే ఇద్దరూ ఒక తలుపుముూల

యిరికి కూలబడ్డారు. ఒదిగిపోయారు. చూపులేని ఆ బాలిక కళ్ళు, చూపుపుట్టని ఆ పిల్లవాడిహృదయం ఒకటికొకటి ఆలింగనంచేసుకొన్నవి. ఆ బాలకుడు కంటినీరు ఆ బాలిక చేతులు అద్దుకుని ఆపుకోపోయాడు.

# 4

ఆ బాలిక పాట ప్రారంభించకపూర్వమే ఒకవ్యక్తి ఆ రైలుపెట్టె ఎక్కాడు. అతడూ రైలుబిచ్చగాడే—ఒక చెయ్యిలేదు.

ముప్పైయేళ్లుంటాయి. చింకిగుడ్డా, చిరిగిపోయిన చొక్కాతో ఒక పిల్లంగ్రోవి ఎడంచేత్తో పట్టుకుని రైలు ఎక్కాడు. అప్పుడే ఆ బాలిక తన దివ్యగానం ఆలాపన చేసింది. తర్వాత జరిగిన కథ అంతా చూస్తూనేవున్నారు.

ప్రపంచంఅంతే కోపంగలమనిషి. వెనక రైల్వేపోర్టరుగావుండి రైలుక్రింద పడిపోయి చేయి పోగొట్టుకున్నాడా బిచ్చగాడు. నా అనేవారు లేకుండాఉండేవాడు. జీతంలో వచ్చిన నాలుగురాళ్ళు మిగుల్చుకుంటూ గూడ్సుస్టేషనులో అప్పుడప్పుడు దొంగతనంచేసిన వస్తువులు అమ్మగా వచ్చిన డబ్బూ, రైలులోంచి దిగిన ప్రయాణీకులసామాను మోయడంవల్ల వచ్చిన కూలి, టిక్కెట్టులేనివాళ్ళను ఇంజనుదగ్గర నుంచో, గార్డుపెట్టిదగ్గరనుంచో పోనిచ్చినందుకు లంచం మామూళ్ళు అంతా కలిపి నూరురూపాయలు మూటకట్టాడు. ఇంతట్లో చెయ్యిపోయినందుకు, రాజమండ్రి రైల్వే ఆస్పత్రిలో మూడునెలలు వున్నాడు. అప్పుడు తాను ఇం

టిలో దాచుకున్నడబ్బు ఎవ్వరో మటుమాయంచేశారు. ఉద్యోగం పోయింది. పెండ్లిలేదు. దాంతో అతనికి మతి పోయింది. దిక్కులేనివాడికి దేవుడుకాడు, తిరిపమే దిక్కు. బిచ్చగాళ్ళకు కొందరు గురువులు వుంటారు. అతడు ఓ గురువుదగ్గర పిల్లంగ్రోవి బాగావూదడం. అందుమీద వేదాంతంపాటలు, భక్తిపాటలు పాడడం నేర్చుకొన్నాడు; రైలు బిచ్చం సాగించాడు.

రైలేగా ద్రోహంచేసింది! ఆ వచ్చినడబ్బుతో కాఫి హోటల్లో తినడం, కల్లుపాకదగ్గిర గొళ్ళపుల్లమ్మకూతురు పోసే ధవళసుధారసం గళగ్రాహంగా సేవించి, సింధూరా నిమిషత్వం, మహాయోగంలో మైకం సంపాదించి అమరుడౌతుంటాడు.

అలాంటివాడు ఆ గుడ్డిపిల్లపాట విన్నాడు. అతని మొఱటు మనస్సు గాలిలో వూగిపోయింది. దోహదంచేసిన మొండిచెట్టు వికసించినట్లు చిగురుదాల్చింది. ఏ ఆవేశమో అతనికి తెలియదు. అతనికి కళ్లు నీళ్లుతిరిగినై.

మనుష్యులచంచలత్వమూ, కఠినత్వము చూస్తే అతనికి అసహ్యంవేసింది. ఎవ్వరూ తియ్యకుంటా, ఆ గుడ్డిపిల్లను సిరసించగానే, అతడు ముట్టెవంచిన కాకుమున్న అయిపోయినాడు. తాను పొద్దుట్నుంచి పోగుచేసుకున్న అరణాలడబ్బులూ ఆ అమ్మాయిచేతిలోవేసి, రైలుఆగగానే దిగి చక్కాపోయాడు. ఆ అమ్మాయికి ఇంత డబ్బు ఎవరిచ్చారో తెలవలేదు. "దేవుడులాంటి దయగల ప్రభువు ఎవరిచ్చారో!" అనుకున్నది.

తక్కినవాళ్ళంతా మేరీనీ కౌగిలించుకొని "నీవు ఆదర్శసమంచితమైన బాలికపుత్తల్లి! భగవంతుడు నీ నూతన తపస్సుకు సర్వసుఖప్రదంగా ఆశీర్వదించునుగాక!" అని ఆమె మూర్ధము మూర్కొన్నారు.

# 13

"మార్జి! ఇంగ్లీషుభార్యతో కాపరంచేయడానికి తగిన ధనంలేదు సంపాదించేమార్గాలూలేవు."

"ఓయి వెర్రివాడా! మేము భారతీయస్త్రీలమవుతున్నాము నీలో ఐక్యమయిపోయే మేరీ నీకు ఎలా అందం చేస్తుందో చూస్తూఉండు. ఆమెకు సాలుకు మూడువేలపౌనులు రాబడివచ్చే ఆస్తి ఉంది. అది ఆమెస్వంతం. తక్కినఆస్తి తనకు అక్కరలేదంటుందట!"

"నేను సాలుకు వేయిరూపాయలు మాత్రం తెచ్చుకోగలను. ఆమె సాలుకు నలభై వేలరూపాయలు తెస్తే ఏలాగు? దరిద్రునకు వివాహం ధర్మమా మార్జి!"

"ఓయి వెర్రివాడా! ప్రేమప్రధానం, ధనంకాదు. నువ్వు అహింసావ్రతాచరణముచేయడమే పనివేలు. ఇన్ని శతాబ్దాలనుంచి దోచుకున్నధనం మేము మీకు ఎన్నిరకాలుగా తిరిగి ఇవ్వాలో!"

విశ్వేశ్వరుప్రేమ మహాకావ్యమై లోకమోహనమయింది.

ఆంగ్లయువతులు ఆంగ్లయువకులకడనుండి, ప్రేమను ఈ అద్భుత స్వరూపంతో చూరగొనియుండరు.

ఆతను ఒకరోజున పద్మాలుచెక్కిన పీఠంమీద అధివసింపజేసి, పదివేల పూవులతో పూజించినాడు విశ్వేశ్వరుడు.

అందాలు పుణికిపుచ్చుకున్న చీరలు ఖరీదుకలవి కొనితెచ్చి, ఆమెను ధరింపజేసి ఆమెకడ మోకరిల్లాడు.

ఆతనికళ్ళలోని పూజ, ఉదయసూర్యుని వర్ణాలులా అలిమివేసినది

"నీ సౌష్టవమూర్తిత్వానికి కాదు, నీ స్నిగ్ధబాలికాత్వానికికాదు, నీ హిమాచ్ఛశరీరకాంతికికాదు, నీ ఆంగ్లోశాక్సను జాతిత్వానికికాదు, నీ దివ్య సౌందర్యానికికాదు, మేరీ! నిన్ను నేను పూజించేది. నువ్వు నా దేవివి! నా మోక్షానివి!! నా నిత్యవు!!!

"నిన్ను ముద్దుపెట్టుకొని నీకు నల్లతనము ఇస్తానేమో నన్నభయం...

"నువ్వు కలగా మాయంకావుగదా? నువ్వు సూర్యునికుమారితవు కావుకదా?"

"ఇన్నాళ్ళు ఈ ద్వేషం నా హృదయంలో వున్నందుకు ఫలితానివా? నన్ను దేషరహితుణ్ని చేయడానికి వేంచేసిన దివ్యసాన్నిధ్యానివా?"

ఆతడు పట్టుశాలి పాందూరుధోవతి ధరించి, పాందూరులాల్చి ధరించి ఆమెకడకు వచ్చినప్పుడల్లా, ఆమె చిన్న పరుగుతోవచ్చి అతన్ని కంఠముబిగియారగా బాహులతలు చుట్టివేసేది.

ఆతని విశాలఫాలంలో వేదఋక్కులు వనసలుపాడుతున్నవని ఆమె అనుకొనేది.

ఆతని కళ్ళల్లో పరమశ్రమణకుడైన బుద్ధభగవానుని శాంతకాంతులు పుంజీభూతాలయి దర్శనమిస్తున్నవని ఆమె వణికిపోయ్యేది.

ఆతనిమూర్తిలో గ్రీకుదేవుడు, అపోలో ప్రతిఫలించ లేదు. సర్వ సౌందర్యరూపాలు ప్రోగుచేసుకొన్న భారతీయ దివ్యమూర్తి ప్రత్యక్షమయ్యేవాడు.

"మీ భరతదేశానికి నేను నూతన యాత్రికురాలిని విశ్వా! నా చేయిపట్టుకుని ఈ దివ్యజ్యోత్స్నలో నడిపించుకుపో" అని ఆమె అన్నది.

వారిద్దరూ ఒంటిగా ఉన్నంతసేపూ ఆమె అతనిఒళ్ళో ఉండవలసినదే! వారి హృదయాలు రెండూ లయలు, శృతులు కావలసిందే.

# 14

మేరీ తక్కినవారితో ఇంగ్లండువెళ్ళి తన వ్యాపారాలన్నీ సర్దుకొని తిరిగివచ్చేటట్లూ, అంతవరకూ విశ్వేశ్వరుడు శివగ్రామ ఆశ్రమంలో వుండేటట్లూ ఏర్పాటుచేసుకొన్నారు.

మేరీ మార్గరెట్టు మొదలయినవాళ్ళతో బొంబాయి వెళ్ళిపోయింది. ఒంటిగా ప్రాణమే లోకానికో పోయిన వానిలా ఉన్నరంటూ ఆశ్రమంలో ఉన్నాడు విశ్వేశ్వరుడు,

అతివేగంగా అతి నున్నితంగా యిరువదినాలుగురకాల దారం వడకడం నేర్చుకో ప్రారంభించాడు.

అతి బాధతో ఇంకొంచిత్రం ప్రారంభించా డతడు. ఉజ్వలరూపమైజగత్కల్యాణమూర్తియైన,శాంతిదేవియొక్క చిత్రము. సర్వకష్టాతీతమైన, సర్వద్వేషాతీతమైన పరమ

ప్రేమమూర్తి! ద్వేషపూర్ణమైన ఈ ప్రపంచంలో ఒక్కొక్క విషయంలో ఒక్కొక్క దివ్యవిధానాన్ని, అహింసాస్వరూప మును నిర్ణయించుకుంటూ, ప్రేమావతారుడైన గాంధీ అహింసామార్గమును అన్వేషిస్తున్నాడు. ఆ మహాభావాన్ని సర్వవిధాలా ఉద్దీపింపజేయడం తనబోటివారి ముఖ్యధర్మము.

ఆ చిత్రం విచిత్ర వేగంతో విజృంభింపసాగింది. నీలాలు, వంగపండు చాయలు పాటలవర్ణాలు.

ఆయిదవరోజున సాయంత్రం ఒంటిగా ఆశ్రమానికి అనతిదూరంలో వున్న ఎత్తుప్రదేశంమీద కూర్చుని విశ్వేశ్వ రుడు మేరీదివ్యమూర్తిని ఊహించుకుంటూ పులకితదేహు డౌతూ, ఈ రెండు నెలలూ ఎట్లాభరించడమూ అని ఆలోచించు కుంటూ, పరవశమైన స్వప్నాలుకంటూ ఉన్నాడు.

దశమినాటి చంద్రుడప్పుడే నీలాకాశంలో పైననే ఉన్నాడు. చంద్రకాంతులూ సంధ్యాకాంతులూ వియ్య మందుతూ వున్నవి.

చటుక్కున చంద్రకిరణాల్లాంటి రెండుచేతులు అతని మెడను చుట్టుకొన్నవి. అతడు గుండెకొట్టుకుంటూ వెనక్కు తిరిగాడు "మేరీ, కలా ?"

"కలకాదు. నేను నిజాన్నిప్రియా! నిన్ను వదలి ఇం గ్లండు వెళ్ళలేకపోయాను. రెండు నెలలయినవెనుక మార్జీ నా వ్యాపారాలన్నీ సర్ది మన...మన...వివాహానికి వస్తుందట".

"ఓహో మేరీ! నీ ఇంతప్రేమకు నే నెట్లా తగుదును దేవీ!" వెన్నెలవెలుగుదీప్తిదాల్చినది. ఆశ్రమంలో అందరూ ప్రార్థనకు జేరినారు.

# గాలివాన

## (పాటకథ)

గాలివాన వచ్చి పంటల్ని గట్టులమీద కెక్కిస్తే ఇళ్లు కూలిపోయి, ఒళ్ళు తలక్రిందులై వళ్ళూ ఊళ్ళూ ఏకమై పోయి, సెలయేళ్ళు మహానదులై, కొండవాగులు గోదావరీ నదులై మేఘాలే భూమికి దిగివచ్చి, ప్రపంచంలోని సముద్రాలన్నీ ఎత్తివచ్చి, శివాలెత్తి, పరవళ్లెత్తి, అవన్నీ అంబరము హత్తుకుపోయి ప్రళయరుద్రుడు తాండవముచేస్తే, కాలరుద్రుడు గంతులు వేస్తే, విలయరుద్రుడు వీరాంగం ఆడితే విరుచుకుపడింది — తుపాను విశాఖపట్నం జిల్లాపైనా, తందానా!

ఈ మహాప్రళయం మధ్యనే కారుపల్లిగ్రామం, గ్రామంమధ్యన భైరి అప్పలస్వామియిల్లు. అప్పలస్వామి ఆరితేరినరైతు. అన్నమాట నిలబెట్టుకొనే దిట్టరి. అసలయిన కాపు. సిసలైన గుణాలవాడు తందానా!

గడపదాటి పైకి కాలుపెట్టిన అప్పలస్వామికళ్ళకి ప్రత్యక్షంఅయ్యాయి—పడిపోయిన పంటలూ, పాడైపోయిన చేలూ, కూలిపోయినగోడలు, కొట్టుకుపోయినఊళ్లు, గోల పెడ్తున్న ప్రజలు, తందానా తాన తందానా!

ఇళ్ళులేవు, వాకిళ్ళులేవు, గృహాలు పడిపోతే దేహాలు వదిలేసినవాళ్ళు, వరదల్లో కొట్టుకుపోయినవారు, ఇదివరదాకా ఉన్న సగంకాటకంతో ఎండిపోయారు జనులు. ఈ ప్రళయం

దివాలాతీసినవాళ్ళయింట్లో దొంగలుపడ్డట్టుఅయింది తందానా
తానా, తానా తందానా తానా!

అన్నీ చూసిన అప్పలస్వామి తన పెద్దగాదెలు తలుపులు లాగిపారేశాడు. గుండిగల్లో వంటలు పెట్టించాడు. అండిగల్లో కూరలు వండించాడు. పాత్రల్లో పప్పులూ, బానల్లో పులుసులూ వండించాడు. బీదామాత్రమేకాదు. సాదామాత్రమే కాదు, అందరికీ, ఆబాలగోపాలానికి కొద్దివారికీ గొప్పవారికీ ముసలివారికీ, ముతకలకీ, బిడ్డలకీ, పెద్దలకీ, ఆడవారికీ అష్టాదశవర్ణాలకీ అన్నమోరామచంద్రా అని వచ్చినవారందరికీ, సిగ్గుబడినా, మొహమాటంపడినా అందరికీ అన్నివిధాలా కనుక్కుని కాశికాన్నదాతలా పెట్టాడండీ
తానా, తానా, తందానా తందాన తానా!

## 2

కామమ్మ అప్పలస్వామికూతురు అందాలబరిణ, అనురాగాలపోగు పెద్దరయితుఅవడంచేత ఊళ్ళో పంతుల్ని పెట్టి చెప్పించాడు చదువు. విజయనగరం పంపించాడు పెద్దచదువుకు. తన చారడేసికళ్ళతో చూసిన పుస్తకం తప్పకుండా హృదయగతం. గులాబిపువ్వుపుటాలల్లా ఉన్న చెవులతోవిన్నపాఠం బుద్ధిగతం. నవ్వితే నవరత్నాలు ఒలుకుతవి; నవకుసుమాలు వర్షాలుకురుస్తవి. తన తీయనికంఠంతో పాటపాడిందా గోవులు కదలవు ఆవుదూడలు మెదలవు. నాగులు ఆడతాయి. వాగులు నృత్యంచేస్తవి. పక్షులు నిలిచి

బొమ్మలవుతవి. ఆకాశంలోమబ్బులే అలకిస్తాయా! తందానా! జయమ్మా!

ఆ అందాలబొమ్మ తుపానుసంగతి వినగానే కాలేజీ నుంచి, అన్నపూర్ణలా వచ్చిపడింది. చిన్నతనంలో కామమ్మా నేడు కామేశ్వరి, స్నేహితురాండ్రకు కాముడు, చుట్టాలకు కామం! తందాన తానా!

ఆ ఖండం అంతా, కాటకంతో మండిపోతోంది. బియ్యం దొరకటంలేదు. జొన్నలు, చోళ్లూ, సజ్జలు, గంటెలు ప్రపంచంలోనే లేవో, అవి ఉద్భవించనేలేదో, అవి కథలలో మాత్రము కనబడతాయో తందానా! తందానా!

ఎంతమంది తల్లులు తమ తీపుల అడ్డాలబిడ్డలకు ఆకలి తీర్చడానికి పాలులేవని తల్లడిల్లిపోతున్నారో, కుళ్ళిపోతున్నారో, తందానా తానా, తందా...నా!

గ్రామనాయకులు, జిల్లానాయకులు, దేశనాయకులు ఎంత గగ్గోలుపడినా, కంఠాలు బద్దలుకట్టుకొని ఉపన్యాసాలిచ్చినా ధనం ఊడిపడదు, దాక్షిణ్యం తొణికిసలాడదు, ధర్మం ప్రత్యక్షంకాదు, వితరణం అవతరించదండో! తానా తానా, తందానా! తానా తందానా తానా!

అప్పలస్వామిగాదె ఖాళీ అయింది పాతర్లు బయట పడినాయి. అప్పలస్వామి స్నేహితులు అరుదైపోయారు; చుట్టాలు చూపులేదు! వకాల్తలు పత్తాదొరకరు; మొహమాటస్తులు మొహాలు చాటువేసుకొన్నారండి బాబూ, బాబూ, బాబూ, బంగారుబాబు వినరండో!

ఇంట్లోనగలన్నీ అమ్మాడు; వెండిసామానులమ్మాడు;

భూములు తనఖా పెట్టి, ఈనాములు కుదువపెట్టి. విజయనగరం షావుకార్లను పట్టుకొని, జయ జయ అంటూ దొరికిన జొన్నలు, చోళ్ళు. గంటెలు, సజ్జలు, వరిగెలు పట్టుకువచ్చాడా అభినవ కర్ణుడు, శిబి దధీచి అయిన అప్పలస్వామిగారా ఏమీ చూశారా తందానా తానా।

# 3

కామేశ్వరి విజయనగరం ఉత్తరాలు రాసి తనతో చదివిన స్నేహితురాళ్ళనందరినీ ఒక సంఘంగా కూడమంది, సభ్యురాండ్రను చేర్చమంది, సభలు చేయమంది, చందాలు వసూలుచేయమందీ తండ్రీ తందాన తందానా !

జనాభా ఎక్కువ, ధనాలాతక్కువ; తినడానికి కడుపుల సంఖ్య ఎక్కువ, తేవడానికి గింజలు తక్కువ; చచ్చినవాళ్ళు చచ్చారు. భగవంతుని ఇష్టంలేక చంపగలవా రెవరు? చావ గలిగినవా రెవరు అని అమ్మలక్కలందరూ వేదాంతాలాడారు, ఓ యమ్మలారా తందానా, తందానా !

తన ఒంటినున్న నగలు రెండువేలరూపాయలు వచ్చినవి; అవన్నీ తండ్రికి ఇచ్చింది కామేశ్వరీదేవి తందానా తందానా !

"ఓ అయ్యా, ఇవి అమ్మి ప్రజలకు పెట్టూ, తిండిలేక మాడుతున్నారు, బీదరైతులకు విత్తనాలకు గింజలులేవు, కూలికి సత్తువలేదు.

"ఏ దేశమూ పోయి

ఏదైన తినబోతె

నడచి పోతేరయ్యా
గడచి పోలేరు
"ఆకారమే లేని
ఆ చిన్నికందులకు
పా లెక్కడున్నాయి
బ ట్టెక్కడున్నాది
కళ్లు దించుకుపోవు
తల్లులట వారంత
తల్లి పిల్లలపాలి
దైవ మే డున్నాడు?"

"అయ్యా, నన్ను విజయనగరంపోనీ, ఏమవుతుందో,"
అన్నదండి ఆ అమ్మాయీ కామేశ్వరీదేవి తందానా!

# 4

టిక్కట్టులేకుండా ఆడవాళ్ళపెట్టిలో రైలెక్కింది, టిక్కెట్టు తనిఖీదారు టిక్కెట్టడిగాడు.

"లేదండి బాబూ!"

"నీవేషం బాగుంది. చదువుకుంటున్నావా?"

"అవునండి"

"ఏం చదువు?"

"బి యస్. సి."

"వారేవా! నీ పేరు?"

"కామేశ్వరి."

"అల్లో కామేశ్వరీ! మరి డబ్బియ్యి, టిక్కట్టిస్తా!"

"అయ్యా! మా ఊరిలో కాటక దేవత కాలుపెట్టడం చేత, కడుపుకులేక ప్రజలు మాడడంచేత విజయనగరంపోయి పెద్దలకూ, పిన్నలకూ, ఉద్యోగులకూ, ఊళ్ళేలువారికి, ధన వంతులకూ, ఘనవంతులకూ మనవిచేసి ధనమో ధాన్యమో పనూలుచేద్దామని బయలుదేరానండి" అన్నది కామేశ్వరీ దేవి తందానా!

"టట్, డామిట్, అది కాదమ్మాయి, అందాల పడుచా! నీ మాట ఎవరు వింటారు? రా! నేను పెద్దల నెంద రినో ఎరిగున్నవాణ్ణి, నీకు సహాయం చేయిస్తానన్నాడండీ, టిక్కెట్టు కలక్టేరూ తందానా!

"రాజ్యం దివాను నాకెరుక, మహారాజా నాకెరుక, కలక్టరు నాకెరుక, ఖామందు నాకెరుక, షావుకార్లు నా కెరుక, సంపన్నులు నా కెరుక, నాతో రా, దివానుగారిదగ్గ రకు తీసుకెడతా" నన్నాడండీ టిక్కెట్టు కలక్టేరు తందానా తానా!

రైలు ఆలస్యమై ఆ రోజుసాయంకాలం ఏడుగంటలకు విజయనగరం చేరుకుంది. టిక్కెట్టుకలక్టరు కామేశ్వరిని వెంట బెట్టుకొని, ఒక గుర్రంబండి చేయించాడు. వాడిచేతిలో రూపాయిపెట్టాడు. అయిదురూపాయలనోటు పెట్టాడు. అమ్మాయిని ఎక్కమన్నాడు. తా నెక్కాడండీ టిక్కెట్టు కలక్టేరూ తందానా!

గుర్రం మంచి జాతిది బండివాడు గడుసురకంవాడు. ఛల్ ఛల్. పరుగెత్తింది, పట్నంబైటే, రస్తాదారిలో కోట వైపుకే పరుగెత్తిందీ; జాతిగుర్రం సుండీ తందానా!

కోట దాటింది, తోట దాటింది, పొలాలు దాటి విశాఖ పట్నం రోడ్డుపట్టింది. గుర్రంబండి వేగంగా వెళ్తోంది దౌడు తీస్తోంది గుర్రం, జాతిగుర్రమండీ తందానా తానా తందానా!

బూతులుతిట్టూ గుర్రాన్ని తరుముతున్నాడు బండి వాడు. ఉప్పొంగిపోతున్నాడు టిక్కెట్టు కలక్టరు. బలే టిక్కెట్టుకలక్టేరు, తందాన తానా!

ఓహో! ఆ కామమ్మకు భయమేసింది. గుండెల్లో దుదుకుపుట్టింది. ఓ కాశీఅన్నపూర్ణా, కంచికామాక్షీ, నన్ను రక్షించుతల్లీ! అని లోన దండలుపెట్టుకుంది. కామేశ్వ రమ్మాయి తందానా, తందానానా, తాన తందానానా!

"సార్ ఇంకా దివానుగారిఇల్లు ఎంతదూరం?"

"ఇదిగో వచ్చాం! ఆపు బండీ!"

బండి ఆగింది; బండి దిగాడా టిక్కెట్ల ఇనస్పెక్టరు. ఆ అమ్మాయి దిగింది బండి. బండివాడు వెంటనే బండితిప్పి గబగబ వెనక్కుతిప్పి విజయనగరందారిపట్టాడు. అది విజయ నగరం దగ్గరే నా కాని నిర్జనస్థలం. అమ్మయ్యో, భయమేసింది బంగారుతల్లికి తందానా!

"ఇది ఏమిటండి బాబూ!"

"ఇది తోట. ఆ ప్రక్కనే మేడ, పద, నా చేయి పట్టుకో!"

కాని అమ్మాయి చేయిపట్టుకోలేదు, అతగాడే ఆమె చేయి గబుక్కున పట్టుకొని, ఒక చిటికెలో గద్ద కోడిపిల్లను తన్నుకుపోయినట్లు పొలంలోకి లాక్కుపోయాడు. ఆఅమ్మాయి

భయంచేత "ఓ" యని మూర్ఛపోయింది. మా తల్లి కామే శ్వరీ తందానా !

మా బాగుండనుకోని ఆ రాక్షసుడు, రక్షంచరుడు, పిశాచి పొలంలోకి. పొమ్మమూట ఎత్తుకుపోయే దొంగలా తీసుకుపోయాడు. వాడిబ్రతుకే నీచమైపోనూ తందానా!

ఆ మూర్ఛలాంటి కళ్ళల్లో,ఆమెఎదుట చిక్కిపోయిన వాళ్లు, పాలులేని పిల్లలు, పంటలులేని రైతులు చేతులు చాచి కనబడ్డారు, మా తల్లి కామేశ్వరీదేవి కోయమ్మా తందానా!

ఒక్కసారిగా ఆ అమ్మాయికి మెలకువవచ్చింది. ఓ శక్తి అయ్యిందండి. ఏలా విదిలించుకొందో వాడికౌగిలింత, కిందికి ఉరికింది. వాణ్ణి సాగదీసి లెంపకాయకొట్టి, ఆ పొలా లలో, గోతుల్లో, లేడిలా పరుగెత్తింది. వెనక వాడు,ముందు, ఆమె దడదాడ దడదాడ తందానా తందానా తాన తాన తాన తందానా!

ఆమెని, ఆ రాక్షసు డందుకోలేకపోయాడు. ఒక రాయి తగిలి పడ్డాడు. ఆమె రోడ్డుమీదికి ఉరికిందండీ తందానా !

ఇంతలో కారులైట్లు. కారు ఆగి ఒక పెద్దమనిషి దిగి "ఎవరమ్మా మీ" రన్నాడు దేవుడై అతడూ తందానా !

"అయ్యా రక్షించండి, ఆ రాక్షసుడు రైలు...... టిక్కెట్లు-దివాను-ఇల్లు-ఇక్కడికి అన్నాడు" అంది వగరుస్తూ మా తల్లి కామేశ్వరీ తందానా !

"అమ్మా నీ పేరు?

"కా...కా...కామేశ్వరండి."

"తల్లీ నువ్వా! నేనే దివానును. నీ ఉత్తరం అందింది, పక్కవూళ్ళో పనివుండి, నువ్వు వస్తానని తొందరగా వస్తున్నా రైతుబిడ్డా, రా తల్లీ! ఈ కారు ఎక్కమ్మా చందాలు పది వేలు వసూలుచేసెదము జమీందారు పది వేలమ్మా" అన్నాడండి. ఆ అమ్మాయి తియ్యటి మూర్ఛపోయిందండీ తందానా తందానా! జై జై జై జై! తందాన తాన!

కథ కంచికి మనం హైదరాబాదండీ తాన తాన తందనాన తానా!



# దీపావళి

కటికచీకటిలో దీపాలు. నల్లటి ఆకాశంలో నక్షత్రాలు. కారు చక్కదనం నవ్వితే ముత్యాల పలువరసలు.

అరుగుమీద దీపాలు. వాకిలిముందర ముగ్గుబొబ్బాసి చెట్లమీద అమర్చిన దీపాలు ఆకాశదీపాలు. ఇళ్ళల్లో దీపాలు, గుళ్ళల్లో దీపాలు: రంగురంగుల మతాబాలు, విదేశీ బాణాసంచులు, స్వదేశీ బాణాసంచులు, టపాకాయల ఫిరంగి మోతలు, చిచ్చుబుడ్లు, తూటాలు, తారాజువ్వలు, దీపాల పండుగ వెలుగువర్షము.

నోట్లో వేలుపెట్టుకొని, ఆ దీపాల వెలుగుల్లో మెరిసే కళ్ళతో నిలుచున్న ఆ వుప్పరిఅబ్బాయికి మాత్రం దీపావళి లేదు.

## 2

పొద్దున్నుంచీ బాణసంచాలకొట్లదగ్గర చింపిరిజుట్టుతో అల్యూమినియం మురుగులతో, నీలి జేగురూ కలిసిన వంటి రంగు వెలుగుతో ఆ వుప్పరిఅబ్బాయి నిలిచి విసుభోతూ చూస్తూనే ఉన్నాడు: అందరికి బాణాసంచాలు; అతనికి మాత్రం లేవు.

సాయంత్రందాకా నుంచుంటేమాత్రం ఒక్క తాటాకు టపాకాయిగాని, సిసింద్రీగాని, మతాబా అగ్గిపుల్లగాని ఆ దర్రవాడిచేతిలో పెట్టే దయతో నిండిపోయినహృదయంకల

వాడు ఒకడూ కనిపించలేదు, పొద్దున్నించీ లక్షలకొద్దీ టపాకాయ లమ్మిన సాహెబు

"సాలా బాగా పేలుతాయండీ! జర్మనీవాడిఫిరంగి లాగా వుండాలి. మీాకే అయిదువందల్ ఏసుకోండి" అని విచిత్రంగా అమ్మగలిగాడుకాని, కొనేవాళ్ళకి చూపించడానికి కాలిస్తే పేలకుండా, తుస్సుమన్న టపాకాయికూడా ఆ కుఱ్ఱవాణ్ణి ఏరుకోనిచ్చాడుకాదు.

పొద్దున్నించీ ఇంటికెళ్ళి తిండయినాతినలేదు ఆవువ్వరివాడు. వాళ్ళమ్మా, నాన్నా, "ఎఱ్ఱోడు ఎక్కడికిపోయాడో గంజి నీళ్లకయినా వచ్చాడుకాదు" అని అనుకున్నాగాని, ఆ కుఱ్ఱవాడికోసం వెదుక్కుంటూ వచ్చినవాళ్లు లేనేలేరు.

ఆ సాయంత్రంనుంచి బందరువీధులన్నీ తిరిగి, ఆ కుంకాయి బచ్చుపేటలో బాగా బాణాసంచాలు కాల్చే ఒక మేడముందర నిలబడ్డాడు. ఆ ఇంటిలోని పెద్దలు ఆడపిల్లలచేత, మొగపిల్లలచేత కాల్పించిన బాణసంచాలు విదేశీవీ స్వదేశీవీ నలభై రూపాయలదాకా ఉంటాయి.

పిల్లల కిలకిలలు, పెద్దల నవ్వులు, గుమ్మందగ్గర కళ్లులేని ముసలమ్మ బోసిహాసం. ఆ యింటిముందర బాణసంచాకాల్పులు చూడడానికి చేరిన తక్కిన బీదవాళ్ళపిల్లలు వెకిలిగా "ఇవి యివ్వండీ! అవి ఇవ్వండి!" అని అడిగి పుచ్చుకొని కాల్చుకొంటున్నారు. భయంచేత పారేసిన సగం కాలుతూ ఉన్న మతాబులు పుచ్చుకొని కాల్చారు. వీడు మాత్రంచూస్తూనే నిలుచున్నాడు. కాని ఒక్క అడుగయినా కదిలాడుకాదు,

వాడిఒళ్ళు ఉక్కుకడ్డీలాగే గట్టిగావుంది. మెరుగు పెట్టిన ఎర్రవాయిలా, నున్నగా తళతళలాడుతోంది. కను ముక్కు తీరుకలిగివున్న మొఖంమీద కాంతులు నృత్యం చేస్తున్నవి. మతాబాలవెలుగు ఆ జుట్టుమీద పడినప్పుడెల్లా మబ్బుపింజలమీదపడిన సూర్యుడి వెలుగులా ఆడిపోయింది. వాడికి పొద్దుటినుండీ కడుపులో కూడులేదు.

## 3

సాయంత్రం వాడు ఆఇంటిదగ్గిర నిలుచున్నప్పటినుంచి ఆ యింటివారి వెధవాడపడుచు ఆ అబ్బాయివైపు తదేక దృష్టితో చూస్తూనేవుంది. ఆవిడికి ఇరవైయ్యాయిదేళ్ళు. చిన్నతనంలో సౌందర్యం మూటలు కట్టుకొన్న మురిపాల పడుచయినా, సాంగత్యమెరుగని భర్తవియోగం సంభవించి ప్రేమకోసం కుమిలిపోయిన సన్యాసినీ రూపం. వైధవ్యంలోనైనా అలంకరించుకొని అందంగా కనపడేవాళ్ళలాంటిది మాత్రం కాదు. తన జీవితంయొక్క పరమావధి ఏమిటా అని పుస్తకాలు వెతుక్కున్న అభాగ్యురాలు. భజనలకు వెళ్ళినా, గుళ్ళల్లో హరికథలకు వెళ్ళినా, పండితుల ఉపన్యాసాలకు వెళ్ళినా' సన్యాసుల జ్ఞానబోధకు వెళ్ళినా విధవయిన పురుషోత్తమ్మ తనకు అస్పష్టంగాతోచే జీవిత సత్యాన్ని కనుగొనడానికే బయలుదేరేది. ఆమెకు ఎప్పుడూ గుండె దడదడా కొట్టింపచేసేది. అందమైన ఆమెకళ్ళను నుబ్బుల్ని చేసేది. తన చుట్టాలలో చూస్తూవున్న స్త్రీలమాతృత్వం మంగళసూత్రంలేని ఆడదీ, మాతృత్వంలేని ఆడదీ, భూమిమీద మన

కూడదని సాయంకాలపు వెలుగుల్లో కలిసిపోతూ ఎవరూ చూడ కుండా చీరకొంగు కళ్ళకద్దుకునేది. చుట్టాలపిల్లలు—జెల్లించి కొందరూ, భయపెట్టి కొందరూ,...ఆమె పెట్టెలో ఎప్పుడూ నిలవవుండే పిప్పరమెంటు బిళ్లలు దినుసులూ, మిఠాయిదినుసులూ, డబ్బులూ లాగేసుండేవాళ్ళు.

ఎవరిపిల్ల లేడ్చినా పురుషోత్తమ్మగుండె బద్దలయి పోయేది. చుట్టాలపిల్లలకి పడిశంభారకంపుచేసినా తుమ్ములు తగ్గేదాకా, ముక్కు వెంబడి పడిశం ప్రవహించడం మానే దాకా, వాళ్ళని వదిలేదికాదు. పిల్లలకి ఎవరికైనా పెద్ద జ్వరాలు వచ్చాయంటే పెట్టెలో దాచుకొన్న వెన్నముద్ద గోపాలవిగ్రహానికి, కాశీ—అన్నపూర్ణవిగ్రహానికి పెట్టని దణ్ణాలులేవు, మొక్కులూ లేవు.

ఆ సాయంత్రంనుంచీ ఇంటి కెదురుగుండానిలుచున్న ఉప్పరివాళ్ళబ్బాయిమీదనుంచి ఆమెచూపులు మరలిపో లేదు. చీకట్లలో కలిసిపోతూ, వెలుగుల్లో మెరిసిపోతూ కదల కుండా ఈకాలిమీదవంగి ఒకమాటూ, ఆకాలిమీదవంగి ఒకమాటూ నిలుచునేఉన్న ఆ పాపడు ఆమె హృదయాన్ని, ఆమె ఆలోచననూ ఇనుమును అయస్కాంతం లాగినట్లే లాగేశాడు.

పంచితే ఒక్కొక్క పిల్లవాడికిగాని, పిల్లదానికిగాని వచ్చిన అయిదురూపాయీల బాణసంచాపున్న బుట్టనూ వాడి చేతకిచ్చి "నాయనా; కాల్చరా!" అందామనుకున్నది.

"ఓసి పిచ్చిదానా!" అని అందరూ నవ్వరా? ఏమి టీ పిచ్చి ఆలోచన?

# 4

ఉన్నట్టుండి కళ్ళుతిరిగి ఆ కుర్రవాడు భగ్నమైనఆశలు కిందకూలినట్లు పడిపోయాడు. ఆ జ్వాలామహోత్సవంలో అరుగుమీాదఉన్నవాళ్ళెవరికీ, ఆ కుర్రవాడు పడిపోవటం గమనించవలసిన అవసరమే లేకపోయింది. అది పురుషోత్తమ్మ చూచింది. ఒక్కపరుగులో మెట్లన్నీ దిగింది. తృణావర్తుణ్ణి హతమార్చి, భూమిమీాద వాలిపోయిన శ్రీకృష్ణుణ్ణి ఎత్తుకొన్న యశోదలాగ పురుషోత్తమ్మ ఆ బాలుణ్ణి ఎత్తుకున్నది; సావిట్లో బల్లమీాద పడుకోబెట్టి ఇంట్లోకి పరుగెత్తుకువెళ్ళి, వెండిగిన్నెలో ఇంతమజ్జిగపోసి అందులో ఇంత వేడివేడన్నం మెత్తగా పిసిగి, మెతుకులు పిండిపారేసి ఆ గిన్నెపట్టుకు చక్కావచ్చింది.

ఆ పిల్లవాడినోట్లో చుక్క చుక్కా ఆమె పోయడం మొదలుపెట్టింది. ఇదంతాచూస్తూ తెల్లబోయి, వాళ్ళవాళ్ళేమీా మాట్లాడలేకపోయారు. అన్నసారం దిగినకొద్దీ ఆ పాపడికి ప్రాణం తెప్పరిలి నెమ్మదిగా మెళుకువవచ్చింది.

ఒక ముసలాయన:— ఈ వెధవను తీసుకువచ్చి బల్లమీాద పడుకోబెట్టిందేమిటి ? పాడుపని !

ఒకావిడ:—వీడెల్లా వచ్చాడిక్కడికి ?

ఒక చిన్నపిల్ల:— మన యింటిముందర పడిపోతే అత్తయ్య తీసుకొచ్చింది.

ఆవిడ:—మడిగట్టుకొని ప్రతివెధవనీ ముట్టుకోవడమేనా ? మన పనివాళ్ళచేతికిఇస్తే నోట్లో పొయ్యరూ ?

ఆయన:—ఈవిడగారికి ఈ పెత్తనమేమిటి ?

పురుషోత్తమ్మ ఈ మాటలన్నీ వినడమేలేదు. ఆ కుఱ్ఱ వాడు కళ్లు విప్పేటప్పటికి ఆమె ప్రాణాలు కుదుటపడ్డాయి. చల్లని గాలిలా సంతోషం ఆమె దేహమంతా ప్రసరించింది. "నాయనా? ఇదంతా తాగు" అని ఆ గిన్నె వాడిచేతికిచ్చింది.

"ఇంక వీణ్ని పంపించు. చేసింది చాలు"

"నీ పేరేమిట్రా వెధవా! ఎవరబ్బాయివి.?"

"మే ముప్పరాళ్ళ ముండి, నా పేరు చిట్టిగాడు,"

ఫోంచేసి చెయ్యికడుక్కొనివచ్చిన ఇంటియజమాని, "వాడిచేతులో రెండుకానులుపెట్టి పంపించివేయండి ఎవరైనా ఇల్లాంటివి చూస్తే మనకి అపఖ్యాతి కూడాను" అన్నాడు

## 5

ఇదంతాజరిగి ఏడాదయింది. మళ్ళీ దీపావళిపండుగ వచ్చింది. తాను చిట్టిగాడిని తన గదిలోనికి తీసుకువెళ్ళి వాడి చేతులో రహస్యంగా రెండు రూపాయలు పెట్టి నాలుగు మతాబులిచ్చి, పంపించిన ఆనాటి సంగతంతా, ఆమెకు జ్ఞప్తికి వచ్చింది. ఆమెకళ్ళ నీళ్ళు చెమరించినవి. చీకటిపడినదగ్గర నుంచీ దీపాలు వెలిగించుకుంటూ పదే పదే చూస్తూన్నది. పురుషోత్తమ్మ మూడేళ్ళ మేనగోడలు మొలకు కట్టిన బిళ్ళ అటూ ఇటూ ఆడుతూండగా, తొనలలాంటి ఒళ్ళు కదిలి పోతూండగా, చేతులాడించుకొంటూ పురుషోత్తమ్మదగ్గరకు పరుగెత్తివచ్చి, అత్తయ్యా! తపాకాయలంటే బయమేత్తుంది. అక్కా వాల్లూ కాల్తేతప్పాలు నన్నెత్తుకోవూ?" అని పురుషోత్తమ్మ మెడచుట్టూ రెండుచేతులూ పెనవేసింది.

"మాతల్లి! అల్లాగేనమ్మా, ఎత్తుకుంటానులే" అని

ఆవిడ ఆ బిడ్డను ఒళ్లోకి తీసుకొని ఒళ్ళంతా ముద్దుపెట్టుకొంది.

అప్పుడే చీకటి ప్రపంచమంతా రంగురంగుల వెలుగులతో అలంకరించుకుంటోంది. మతాబాలు వెలుగుతున్నై. వటేలుమంటూ టపాకాయలు పేలుతున్నై. అనంతపథాలలో ఉన్ననక్షత్రా లన్నింటిని పోగుచేసి, మళ్ళీ విశ్వంలోకి వదలుచున్నారా! అన్నట్లు శేరు తూటాలు జాజ్వల్యమయిపోతున్నై. ఇంతట్లో చిట్టిగాడు దీపావళి పొట్లాలు పట్టుకువచ్చి నెమ్మదిగా ఆవిడదగ్గర పెట్టాడు.

బీదవాళ్ళకు దీపావళిపొట్లాలే మతాబులు, కాకర పువ్వొత్తులు, టపాకాయలు, తూటాలున్నూ! మగ తాడిచెట్టు గులకలు పోగుచేసి, కాల్చి బొగ్గుచేసి గుడ్డలో పోసి పొట్లం కిందచుట్టి పేడరాసి, తాటికమ్మని నాలుగుబద్దలుకింద చీరి మధ్యన ఆ పొట్లంపెట్టి నిప్పులుపోసి బాగా అది రాజిన తరువాత దాన్ని తిప్పడం ప్రారంభిస్తారు చిటపటమని పేలుతూ రవ్వలు వర్షింకురుస్తవి. ఆ రవ్వల ప్రవాహంలో మునిగిపోయిన ఆ పిల్లల ఆనందానికి అంతుండదు.

పురుషోత్తమ్మ పొట్లాలు చూసింది, చిట్టిగాణ్ని చూసింది. చిట్టిగాడునవ్వుతూ ఆమెకేసి చూశాడు.

పురుషోత్తమ్మగుండె దడదడలాడింది. పురుషోత్తమ్మ మేనగోడలు చిన్నపిల్ల కిలకిలనవ్వి, చప్పట్లు కొట్టింది. పురుషోత్తమ్మ గబగబ లోపలికి పరుగెత్తుకువెళ్ళి మంచంకింద ఎవరికీ కనిపించకుండా, దాచిఉంచిన బాణసంచాబుట్ట ఇవతలికి తీసి చీరకొంగుచాటున కనపడకుండా పట్టుకు చక్కావచ్చింది.

ఆమె పెదవులు కంపించాయి. ఆమెకళ్లు చెమరిం

చాయి. ఆమె హృదయంలో ఏదో తీపిపుట్టి, ఆమెవటోజా లను ఉప్పొంగజేసింది.

"ఇది పుచ్చుకుని ఇంటికి వెళ్ళి కాల్చుకో! పో!!" అని పురుషోత్తమ్మ ఆ బుట్ట చిట్టిగాడిచేతిలో పెట్టింది. చిట్టిగాడి మోము తళతళలాడిపోయింది. వాడిపెదవుల్లో కన్నుల్లో ఉషఃకాంతులవంటి నవ్వులు పరుగులిడినవి.

ఇంతట్లో ఎక్కడనుండి వచ్చాడో! కారుమేఘంలా చిట్టిగాడిదగ్గరికి, ఆ యింటియజమాని. వాడి చేతిలో బుట్ట లాక్కొని మొహం ఊడిపడేటట్లు ఛెళ్ళున ఒక్క లెంప కాయ కొట్టినాడు.

"వెధవముండకి పెత్తనాలు ఎవరిమ్మన్నారు? ఈబాణ సంచాఏమిటి? ఊళ్లోవాళ్ళందరికీ బాణసంచాలు పంచిపెట్టే టట్టయితే ఇల్లూవాకిళ్లూ ఆస్తులూ ఆగుతాయా?" అని "పోరా! వెధవా! నిరుడొచ్చావు చాలదూ? మళ్ళీ శనిలా దాపురించావా" అని ఆ యింటియజమాని చిట్టిగాణ్ని ఒక్క తాపు తన్నాడు.

"అమ్మయ్యో! చంపేశా"డని మడి అనికూడా ఆలో చించకుండా, అరుగుమీదనుంచి ఉరికి వాణ్ని చివ్వున ఎత్తు కొన్నది పురుషోత్తమ్మ.

"ఛీ! పాడుముండా!"అంటూ ఇంటి యజమాని మెరు ములా బుట్ట అరుగుమీద పెట్టడం, చిట్టిగాణ్ని ఆమె చంకలో నుంచి లాగడం, ముట్టుకుంటేనే తన పవిత్రతఅంతా తగలబడి పోతుందేమో అన్నట్లు వాణ్ని చెయ్యిపట్టుకొని వీధిమధ్యకి విసిరివేయడం అంతా తృటిలో జరిగిపోయింది.

# 6

చిట్టిగాడికి లోకం తల్లక్రిందులైపోయింది. రోడ్డుమీద రాయి తలకుతగిలి, పగిలి రక్తంకారడం మొదలుపెట్టింది. పురుషోత్తమ్మ కెవ్వున అరుస్తూ అరుగుదగ్గరే కూలిపోయింది.

ఈ గలభాకు ఇంట్లోవాళ్ళు పిల్లలూ, పెద్దలు, అరుగు మీదకు చక్కావచ్చారు. పొట్లాలివ్వడం తప్పు, బుట్ట తీసుకోవడం తప్పు, ఉప్పరవాడ్ని పుట్టడం తప్పు చిట్టిగాడి కేమి తెలుస్తుంది? వాడి మొఖంఅంతా రక్తమయమైపోయింది. ఉగ్రుడైపోయిన యజమాని ఇంకా రెండుదమ్ములు ఉన్నదానికి పిడికెళ్ళు ముడుచుకొని, కోరను కనపరుస్తూ కాట్లకుక్కలా కస్సు బుస్సుమంటూ వాడి దగ్గరికి నడిచాడు. అరుగుమీద చంటిబిడ్డ ఒకటేగోల. వాడికొమ్ములు చూపిస్తూ, బుసకొట్టుతూ వచ్చే మహిషాసురుడిలా ఉన్న ఇంటియజమానుణ్ని చూచి సమ్మెటపెట్టులాగ తలమీద బాధఅయినా, గమనించకుండా, చిట్టిగాడు లేచి భయంతో కనుపాపలు తిరిగిపోగా కెవ్వు కెవ్వున అరుస్తూ పరుగెత్తడం ప్రారంభించాడు. పురుషోత్తమ్మ లేచింది. మహాకాళికలా ఉగ్రురాలయిపోయింది. "ఈ రాక్షసుడు వుండే కొంపలో, నే నసలే వుండ"నని పొలికేక పెట్టింది. శోకాన్ని దుఃఖం తరుముకొనివచ్చింది. "చిట్టిగా! చిట్టిగా!" అంటూ వాడు వెళ్ళినదారినే తూలుతూ ఆమె ఆ దీపావళి—వెలుగుల్లో, చీకట్లల్లో వీధులలో సందులలోపడి నడిచిపోయింది.

"అత్తయ్యా కావాలీ, అత్తయ్యా కావాలి" అని అరుగుమీద చంటిబిడ్డ మారాం పెట్టింది.

# సోమసుత

ఓ సోమసుతా! నువ్వు నా ప్రియురాలవు. కాని నీకోసం దేశాలన్నీ వెదుకుతూవున్నాను. నువ్వు ఎప్పుడూ దూరదూరాననే. నీమూర్తి నా కౌగిలికి యెప్పుడూ అందలేదు. విదియనాటి చంద్రవంక విరిసే కొత్త లేవెన్నెలలోని మసకమసక కిరణాలమధ్య చిన్నబాలిక నడివేసవిలోపూలకై వెదకులాడినట్లు నీకోసం వెదకీ వెదకి యేటిఒడ్డున నిట్టూర్పు విడుస్తూ చదిగిలబడ్డాను. తియ్యాటి చంద్రవంక యెర్రటి నవ్వులు నవ్వుతూ పడమటికొండలవెనుక పక్కునమాయమైంది. దిశలు చీకటిమేలిమునుగులు సవరించుకొన్నాయి. ఏటి కెరటాల అంచులమీద చంద్రవంకలు నృత్యంచేస్తూన్నట్లే కనపడ్డాయి. ఓ సోమసుతా! నువ్వు చంద్రుని త:యవు, నువ్వు ప్రేమబాలవు. నిన్నెప్పుడూ నాకళ్ళలోనే దర్శించినాను. వెన్నెట్లోపడుకొని నిన్నుగురించి కలలమధ్యన నేను పులకరాలుపొందుతూఉంటే ఒక్కనాడూ నువ్వు నాకు ప్రత్యక్షంకాలేదు. ఆ వెన్నెట్లో నేను గాఢసుషుప్తిలో మైమరచిఉన్నప్పుడు ఉజ్వలానందజోత్స్నలైన నీ చూపులు అరమూతల చక్రవాకాలుకాక నా సమీపంలో మూర్తి పొంది నన్ను నీ లేతచిగుళ్ళ చల్లనివేళ్ళతో తాకి, నేను ప్రేమతో జలదరించి మత్తులూరి తీపితేనియలతేలి కళ్ళు తెరచే లోపలే నువ్వు అదృశ్యవైనావు.

నువ్వు నా ప్రణయవల్లరివి. నాభావాలు, నాకోర్కెలు చివుళ్ళలోనుంచి చిరువసిరి కందిమొగ్గలు తొడిగే చిన్ననాటి నా ఆటరోజుల్లో నేను రాజకుమారుణ్ణి, నువ్వు రాజ

"వెదికినానే నిన్ను
చదల భూమిని గాలి,
చదివినానే నిన్ను
కతల, పాటల, కలల
సుదతి నా యాత్ర కే-
-విధము ఫలమొచ్చేను ?
బాలికా బాలికా
బంగారుతూలికా
మల్లె జూకామల్లె
మాలికా మాలికా"

ఈ పాట నా గొంతుకలోనుంచి అప్రయత్నంగా వచ్చింది.

ఆ అమ్మాయి వెనక్కి తిరిగి "మీదేవూరు" అని ప్రశ్నించింది. దగ్గరొక పల్లెఅని జవాబు చెప్పాను. "ఈపట్టణంలో చదువుకుంటున్నారా?"

"చదువు పూర్తిచేసుకొని సరదాకోసం దేశాలు తిరుగుతోన్నాను."

"మిమ్మల్నెక్కడో చూచినట్లుంది?"

"ఇక్కడే చూచి ఉంటారు."

"ఎక్కడ మీరు చదువు పూర్తిచేసికొంటా?"

"శాన్తినికేతనంలో"

"ఏమి అదృష్టమండీ! శాన్తినికేతనం చాలా అందమైనదట! ఎంతో చక్కగ చదువూ- నాగరికతా- జీవితమూ ఉంటుందట కాదూ?"

"ఔనండి. ఈనాటి కవిప్రపంచంలో దివ్యుడైన మహా కవి పరిపాలిస్తూవున్న ఆ రాజ్యంలో సంచరించటాని కదృష్టం పొందినవాళ్ళంతా అమరులు అని మనవిచేస్తున్నాను."

"అయితే మీకుకూడ అమరత్వం బాగా అబ్బిందన్నమాట!"

"ఎవరో నావంటి మూర్ఖులకు తప్ప."

"అయితే మీరు తప్పకుండా మాయింటికి రావాలి. మా నాన్నగారికి రవీంద్రుడంటే మహావెర్రి. రేపు తీరుబడిగావుంటే వస్తారా?"

"అతి సంతోషంగా."

ఆరాత్రి ఎలా వేగిరించానో తెలియదు. అసలు నిద్రే లేదు. సముద్రములోని మహాతరంగాలులా కలలు తరుముకు వచ్చినవి.

"ఏటి మిలమిలలోన
తోట నవనవలోన
వెలుగు నీడల్లవైపు
వెదకుతూఉన్నాను."

ఈమే సోమసుత కాబోలు. కాబోలేమి? ఈమే నా సోమసుత. ఎంత అందమైనది. ఆమె మాటలు పాటలే. ఏదో మహాదర్థము లేక యిల్లా తనకుతానై ఎలా పలకరిస్తుంది. ఇంటికి రమ్మన్నది. ఆయిల్లు నాకలోకంలోని ఒక భవనమా? దాని గోడలు పూలతో కట్టివుంటారు. పైకప్పు చిగుళ్ళు. వెన్నెల కిరణాలు దూలాలు. భరతపక్షి పాటలు తలుపులు. ఆమెకు చెలికత్తెలు నక్షత్రాలు. నే నలంకరించుకోనా?

గుప్తమైయున్న నిధులన్నీ అలంకరణయోగ్యమైన నగల కోసం మంత్రపు కాటుక పెట్టుకొని పారకించి చూడాలనా? నేను సంతోషంతో లోక మానరిస్తోన్నాను. వెన్నెలలో తేలిపోతూన్నాను. ఈ వెన్నెల ఎంత పరీమళమైయున్నది. ఈ వెన్నెలకొంత తీసుకొని మొఖానికి వొంటికి రాసుకోనా? ఈ పువ్వులు వర్షంకురుస్తోన్న వేమిటి? ఈ పువ్వులలో దాగి వున్న కోమలత్వమంతా యమునానదిలా ప్రవహిస్తూన్నది. ఈదలేక మునిగిపోనుకదా?

## 3

అరుణకాంతుల గులాబీ రేకల్లా చల్లుతూ ఉదయ సంధ్యా దేవి ప్రత్యక్షమై నన్ను చూసి చిరునవ్వు నవ్వుతూ మాయమైపోయింది. ఆ రేకలపై ఒదిగియున్న పన్నీటి మంచు బిందువులు చెదిరి నా వొంటినిండా పడ్డవి.

అలంకరించుకొన్నాను అమృతభూషణాలు— ఆనంద వసనాలూ—

ఎనిమిది గంటలకు వారి ఇంటికి చేరుకొన్నాను. సేవకుడు చూపించిన కుర్చీపై త్రిభంగాకృతిని అధివసించాను. “కలయో? నిక్కువమో?” అనుకొన్నాను.

“ఏదండి కల అని అనుమానం తెచ్చేది?” అని నిన్నటి బాలిక గాలికి కదిలిన తామరపూదళములులా పెదవులు కదిలించి నవ్వింది.

ఓ సూర్యసుతా, నీ వప్పుడా మెకళ్ళల్లోంచి తొంగి చూచావు. నీ నిర్మలజ్యోత్స్నలు ఆ మందిరమంతా ఆవరించినవి.

అప్పుడు నేనన్నాను "కలగాని కల, నిక్కవము గాని నిక్కవము, వెలుగు నీడలలా చక్రాకృతిని మహా వేగంతో తిరుతూంటైగదా!"

"దూష్వాహం చూచినవారిమాట" ఇదే సమయం సంభాషణ వేరేవిధంగా మార్చటానికి.

"ఆ సూరదాసుకథ యెంత మనోహరంగా ఉన్నది. ఆ కథను ఏ న్యూథియేటర్సువాళ్ళో ఫిలుంతీస్తే బాగానే వుంటుంది."

సోమసుత అయిన ఒకబాలిక భావ్యవాసనల నానందించు భావపూర్ణహృదయగా ప్రత్యక్షంగా ఏలా అవుతుంది? స్వర్గములోని దేవతాకన్యలు శాసనసభలను గురించి చర్చించుకుంటారా?

ఈ ఆలోచన మనస్సులో మెరుములా ఉద్భవించిన మరుక్షణంలో ఆ అమ్మాయి అన్నది: "ముక్కు మొగము ఎరగని ఒక యువకుని ఉద్ఘాటించి మా యింటికి రావయ్యా అని పిలిచిన ఓ అమ్మాయి నీమనస్సులోని ఆశయమూర్తి అయిన దేవతాకన్య అనుకున్నావా?"

ఈ బాలికకు ఎదుటివారిమనస్సు అవలీలగా గ్రహించే శక్తిఉన్నదా ఏమిటి చెప్మా!

ఆ అమ్మాయి చిరునవ్వు నవ్వుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది. చదువుతూ వున్నప్పుడూ స్వప్నాలకన్నాను. పలికినపలుకులలో పాడినపాటలలో తలపులకుదాటిన వర్ణాల కలుపులకు మీరిన స్వర్ణాల స్వప్నాలకు ఆవలి అయిన రూపురేఖలరుచి తాళతళ్యానికి ఒదుగుతూ నులువెచ్చని

దైహిక పరిమళాలకు అందీ అందకున్నట్లు ఏదో ఒకమూర్తికై ఆశించి ఆశించి అది గీటురాయిగాక అలంకార నిబంధనగాక పీటకెక్కించిన ఏదో అనన్యసౌందర్య శాస్త్రానుభూతమైన ఒక పరమభావానికై చేతులుచాచిన నేను- నా సోమసుత ఈ బాలికామూర్తిలో తేజస్వినియై నాకు దివ్యదర్శనమిస్తుం దని నే నెలా అనుకొని వచ్చాను?

ఒక్క పరమభావము నాకు
చిక్కునో లేదో
ఒక్క అతిలోకసౌందర్య
మది దొరుకునో లేదో
ఎందు కీ అన్వేషణ
ఎందు కీ యాత్రలు
మృగతృష్ణలో నీరు
ఇంద్రధనువులతీరు
ఏనాటికైన నిజమా?

ఈపాట నేను సన్ననిగొంతుకతో పాడుకుంటూండగా ఆ అమ్మాయి రెండుమూడు మిఠాయిలతో వొలిచినసా త్కుడి తొనలతో కాఫీసెట్టుతో అవి అన్నీ పనికత్తెచేత పట్టించుకుని లోపలికి చక్కావచ్చింది.

"నిరుడు మీరూ నేనూ ఒకేకాలేజీలో చదివితిమి. నిరుడు మీచదువు పూర్తిచేసుకుని వెళ్ళిపోయారు. నా చదువు ఇంకా మూడేళ్లు పట్టుతుంది. కాలేజీలో మీ ఉప న్యాసాలు విన్నాను. కృష్ణశాస్త్రిగారి 'ఊర్వశి,' బాపిరాజు

గారి "శశికళ" మీరు అత్యుత్కృష్టభావాలని ఇచ్చిన ఉప న్యాసాలు విన్నాను."

"ఆ మీటింగులో మీరుకూడ ఉన్నారా ఏమిటీ?"

"ఆ, వున్నాను. మీరు ఆరోజున "ఊర్వశి" పాటలు 'శశికళ' పాటలు రెండూ చదువుతూ అభినయం చేశారు. జ్ఞాపకంవుందో లేదో, మీరు చదివేవిధానం, మీరు చదివిన పాటలలో ముఖ్యంగా మీరు కనపర్చిన వాచికాభినయం నన్ను ఆనాడే సమ్మోహనపర్చాయి."

"అప్పటినుంచి మీరు నేనానాడిచ్చిన ఉపన్యాస విష యాన్ని చర్చించుకుంటూనే వున్నారా?"

"వినడమేకాదు. నేను ఈయనకు శశికళనైతే ఏమను కుంటాడని అనుకున్నాను" అని ఆ అమ్మాయి పక పక నవ్వింది.

## 4

నేను తెల్లబోయాను. నాకు మాటలేదు. ప్రపంచా తీతమైన సోమసుతాభావము ప్రపంచంలోవున్న ఒక బాలి కలో ఎలా ప్రతిఫలించగలదు!

"మీరు వెదకే స్వప్నము ఎప్పుడూ స్వప్నమే. స్వప్నాలు ఎప్పుడూ నిద్దురపోయేవారికే. ఈనాడు దేశంలో క్షామం; దేశం అవతల భయంకర యుద్ధం. దేశం అంతా రోగాలు; దేశం అవతల దారుణ యుద్ధాగ్నిజ్వాలలు. ప్రపంచ మంతా ఆర్తనాదం. ఆర్తనాదంలోను మహాప్రళయంలోను అందం ఎక్కడ, ఆనందం ఎక్కడ? ఊహింపగరాని ఏదో ఒక మూర్తిని నిర్మించుకొని అది ఎక్కడ అని సర్వప్రపంచము

ఎన్ని యుగాలు వెతకగలరు? కక్షలూ కాటకాలు లేని రోజుల్లో కూడా కలలుకనడానికి తావులేదే!"

"మానవాతీతమైన సౌందర్యం వెతకడంలో మానవోత్తమమైన సౌందర్యం దర్శనమౌతుంతా లేదా?"

"ఎంత వుత్తమమైనా! మానవసౌందర్యమే కదా!"

ఉపహారానంతరం నేను మెల్లిగా ఇంటికి చేరుకున్నాను. ఈ సౌందర్యాన్వేషణయొక్క పరమార్థమేమిటి?

# 5

"సౌందర్యోపాసన, మనుష్యుని జీవితాభ్యుదయాని క్కావలసిన కఠినత్వాన్ని కరగించివేసి, బానిసత్వ చిహ్నమైన వెన్నతనాన్నీ, నీళ్ళు కారిపోవుతనాన్నీ మనుష్యుని బ్రతుకంతా నింపుతుందట. ఏ దేశంలోనైనా ఉత్తమ కళలు ఉద్భవించిన కాలం వీరులైన మహారాజులు సామ్రాజ్యాలు స్థాపించిన రోజుల్లోనూ సామ్రాజ్య నిర్మాతలైన ఆంధ్రుల కాలంలో - ధాన్యకటకం మొదలైన సాతవాహన శిల్పం, రాయలకాలంలో విజయనగర శిల్పమూ ప్రబంధయుగమూ తారాపథాలంటాయి; పాశ్చాత్య దేశాల్లోను ఏథెన్సు అత్యంత బలవంతమై వున్నప్పుడు, పైడాసు మహాశిల్పి ఒక దివ్యశిల్ప ప్రపంచం అల్లివేశాడు. ఇక సౌందర్యారాధన బలహీన మెల్లా అవుతుంది! ఆ అమ్మాయియొక్క భావం ఏమయి వుంటుంది? శృంగారస్వరూపమైన సౌందర్యార్చన సామ్రాజ్య తత్వాన్ని తెలియజేస్తుంది. మానవజీవిత - సౌందర్యార్చన, మహోత్కృష్టమైన ప్రజాస్వామ్య శక్తిని మూర్తిభ

వింపజేస్తుంది." అని కాబోలు! పుష్పేతరమైన పరిమళము ఏది? జీవితేతరమైన సౌందర్యమేది? ఈ సౌందర్యానుభూతులన్నీ సప్తస్వరాలు చేసి, ఆశయం తాళంచేసి, ఒక మహాగాంధర్వం అల్లుతాడా మనుష్యుడు. ఆ రాత్రంతా నాకు నిదురదరికి చేరలేదు. కలహాంతరితయైన నాయికవలె తన ఆనందాన్ని, నా ఆనందాన్ని కూడా చెడగొట్టుకొన్నది.

ఎందుకు ఆ బాలిక నన్ను పిలిచింది? ఏదో నా దారిని నేను

"తోవ తెలియని నేను
ఏవైపు పోదునో!
నా వెదుకు తపసులో
నా సిద్ధియే నాకు"

అని పాడుకొన్నాను.

ఆ బాలిక నా ఆలోచనా - పథాలనుండి మాయము కాదు. ఆమె సౌందర్యస్ఫుటరేఖాప్రవాహాలు నా హృదయ సముద్రంలోనే సంగమించాలా! ఆమె నున్నటి గులాబి పెదవుల హాస్యహాసాంచలాలు, నాకు సోమసుత వెన్నెలలే యగునా? కర్కశమైన అతి-మానుషమూ స్త్రీ పురుష ప్రేమ తన్నుతాను మరపించుకొనే మోసబుద్ధితో, సోమసుతా-భావమున ప్రత్యక్షం చేసుకొంటున్నానా?

రాత్రి పన్నెండైంది. నా చిన్న మేడ వీధితలుపు ఎవరో తట్టినారు. దీపాలన్నీ వెలిగించుకుంటూ కిందకు వెళ్ళి తలుపు తీసినాను. ఎదుట ఆ అమ్మాయి, ఆమె అన్నగారు "నేను లోపలికి రావచ్చునా?"

ఈమె, నా మధుర మధురాలోచనలకు చిరుచేదులు కలుపవచ్చినది కాబోలు.

ఆమె:- ఓయి వెఱ్ఱివాడా! నీ ప్రేమకోరి నేను రాలేదు. నా ప్రేమను నీ కర్పింపరాలేదు. ప్రేమ అనేది మనుష్యుల్లోని నీరసత్వాన్ని కప్పిపుచ్చే అందంగా చెక్కిన మూతవంటిది. సినీమాచూచి వెడుతూ నీ డాబామీద నీవు తిరగడం చూచి, నిద్రపట్టనీయని సోమసుతారాధనావేదన నాకు నవ్వు కలిగిస్తే ఉపయోగముకాని నీ శక్తులు నాలో కరుణ స్పందింపజేసి, నన్ను నీ గుమ్మందగ్గర ఆపి నిన్ను పిలిపింప జేసినవి. నీ తలుపు వేసుకో, నే నీ గుమ్మం ఇవతలనే వెనక్కు తిరిగి నా దారిని నేను. నా గుండెపై సమ్మెటపెట్టు...

నేను "...నా ఒకనితనంలో మరియాదలు మఱచిపోయిన మొఱకుణ్ణి నేను. మీ యిరువురూ లోనికి దయచేయండి, అదే నన్ను క్షమించిన గుర్తు"

మేము ముగ్గురమూ ఆ డాబాపైకి వెళ్ళి కూర్చున్నాము. నాకు మాటలేదు, ఆలోచనలేదు, ప్రశ్నలేదు, జవాబులేదు. కుంగి హృదయంపై తలవాల్చి, అమర్యాద వస్త్రమును కప్పుకొని, వారిరువురిఎదుటా, నా కుర్చీలోనే "సోమసుతా! సౌందర్యమే నీవై, సర్వరసాధిదేవిని నీవై, ఆనందసిద్ధివై అర్చనవై, ఫలమవై, కోమలత్వానివై అలంకారమవై సమ్యగ్రేఖావిన్యాసమవై నీ వెచ్చట,

"చల్లని వెలుగులో
ఫుల్లమగు పూవులో
తళుకాడు తారలో

తరుణబాలల హృదిని
నీవు నిలిచెదవేమొ?
నిజ మేమి తెలియగల?"

వారి వారి ఆసనాలపై వారిద్దరూ ఉన్నారా! లేరా? అని తలెత్తి చూచాను. అతడు లేడు. ఆమె నా దగ్గిరగా నిల్చునివుంది.

"ఓయి కలలమూర్తీ! కలలు కడుపులోనికి కాసింత కూడు పెట్టగలవా? నీ విచిత్రచరిత్రను నా అన్న నాకు వెనకే చెప్పినాడు. నువ్వు చిత్రకారుడవు. కవివి రాజకీయ సమాలోచనా ప్రశస్త సిద్ధాంత వేత్తవు. కడుపులుమాడి, కళ్లు దించుకుపోయి, కట్టబట్టలేక, కాటక - రాక్షస హస్తాలల్లో ప్రాణాలు చిమ్మ నలిపివేయబడిన మానవజాతి, నీ సౌందర్యార్చనలో భాగం కాలేదా?"

"సౌందర్యారాధనకూ దైన్యానికీ శృతి కలవదు."

"నీ వెరిగున్న బాలికలలో నే నందమైన దానినా కాదా? నన్ను చూసి చెప్పు, రంగులుపూసి, రేకలుదిద్ది, సృష్టిలోని అపశృతి సవరించాననుకొనే కల్పనా సుందరికన్న నే సౌందర్యవతినా కానా, నన్ను చూసి చెప్పు? నీవు విన్యసించిన కళ్ళలో యీ కాంతులున్నవా? నీవు పులిమిన ఆ దేహపురంగులో ఈ మసృణత్వమున్నదా? పరిమళపూరితమై నునువెచ్చనై మహా మధురకాంక్షలను ప్రసవణిస్తూ వున్న నా యీ అద్భుతమూర్తికి నువ్వా వంకరదిద్దువాడవు? ఎంత వెఱ్ఱి చిత్రకారుడవు! పోనీ నీ పాటలతో నన్ను వర్ణించు; ఎన్ని పాటలు వ్రాయగలవు? నీ రంగుపెట్టెలోని అరుణ

వర్ణాన్ని తిరిగితిరిగి కలిపినా, దివ్యమనోహరార్ద్రిత రేఖా సమన్వితమంజిష్ఠ వర్ణము తీసుకొనిరాగలవా? ఓయి వెఱ్ఱివాడా! జీవితమాధుర్యం గుర్తెరిగినవాడే అమృతం వూహించుకో గలడు. గాఢ నిర్భర మానవదైన్యం హృదయమార స్రవించేవాడే దివ్యకాంతి ప్రసరిత కరుణ-రసాత్మక బ్రహ్మానందము చవిచూడగలుగుతాడు. నేను నీకై వచ్చాను. నీకైయే నన్ను నీ గుమ్మముదాటి వెళ్ళిపొమ్మంటావా?"

ఆమెచుట్టూ వెన్నెలలు, ఆమెనుంచి వెన్నెలలు, ఆమె చలితాక్షుల వెన్నెలలు, ఆమె రసాలకిసలయ-మసృణాధరోష్ఠాల వెన్నెలలు, దేవీ! నువ్వేనా, సోమసుతవు? బహుకాల స్వాతంత్ర్యయోగత ప్త శుష్క-నపువులో నువ్వు, సర్వ మానవకోటి కళ్యాణగమ్య పథదుర్గమయాత్రికులైన నాయక శ్రమిత ఘర్మాంబువులలో నువ్వు, సర్వ వికృతులలో నువ్వు. రసాకృతీ! రస-మయాకృతీ!

ఆమె పాదములు స్పృశించి, లేచి ఆమె రెండు చేతులను గ్రహించి నా చుట్టూ నిర్మించుకొన్న యీ యింటి ముఖద్వారము నా సోమసుతతో దాటి సముద్రతీరానకు జేరినాను.

అక్కడ అధివసించి మేము, మా యెదుట నృత్యము తరంగలాసికా రమణీబృందము.

ఆమెను హృదయాని కద్దుకొని, ఆమె పెదవులను ముద్దిడినాను. కంటి కొలకులనుండి స్రవించి, పెదవుల తడుపు ఆమె బాష్పములు లవణమయములు. ఆమె పెదవులు మహా మధురములు. లావణ్యములైన తరంగాలను చుంబిస్తూ మహా మధురములైన వెన్నెలలు.

# కన్ని

కురూపియైన ముష్టిబాలికను కొంచెం కరుణతో చూచి, ఎవరైనా గుప్పెడు గింజలుగాని, ఒక రాగిపైసగాని, మొహం అవతల తిప్పైనా, విసిరేస్తారు.

కొంచెం కనుముక్కు తీరు సరిగావున్న అమ్మాయి, యవ్వనంలో వుండి బాబూ! ఇవ్వాళ పొద్దుపొడిచిన దగ్గిర నుంచి ఒక్క పిడచైనా లేక మలమల మాడిపోతున్నాను. ఏమైనా ఇవ్వండి రాజా!' అంటే, 'ఛీ! నోరుముయ్. పోతరించుకున్నావ్, ఇంత పనీపాటా చేసి నాలుగురాళ్ళు సంపాదించుకోకూడదూ?' అంటాడా మహారాజు.

అంతపనీ అయింది కన్నికి. రాయలసీమలో తిండి సరిగా వుందనా? పరువుగల కుటుంబాలే, దూరాన్ని గంజి చూచుకొని బ్రతుకుతున్నారు. అన్నమోరామచంద్రా! అంటే అన్నమోరామచంద్రా! అని వానలరూపం మరిచిపోయిన పొలాలుకాని ఆ యెడార్లు ప్రతిధ్వనిస్తాయి. చెరువులవైపు చూసి పొలాలు, పొలాలవైపు చూసి చెరువులూ కంటతడి బెట్టటానికైనా నీళ్లులేక, వేడినిట్టూర్పులు విడుస్తాయి. మొక్కబళ్ళకైనా ఒక్క పువ్వు పూయని యెండినచెట్లు, కొట్టి కడుపులో మంట చేసుకొనేందుకే పనికివస్తాయేమో!

## 2

కుటుంబాన్ని పోషించేభారం కన్నమ్మమీదే పడింది. గుత్తిస్టేషను వెనకపక్క ప్లాటుఫారంమీద నుంచుని, రైలు పొడుగునా తిరుగుతూ ముష్టెత్తుకొనే కన్నికి పైసలు, అణాలు

కాకాసులు, ఒక్కొక్కప్పుడు పావలా-కాసులు కురిపించు రైళ్ళ పెట్టెలన్నీ నిండివుండే సిపాయివీరులు. డబ్బులు వేస్తూ వినరాని కూతలు కూసేవారు. పళ్ళు పుచ్చుకుని ఆమె రొమ్ముమీద పొత్తికడుపుమీద విసిరికొడుతూ హేళనచేసే వారు. కన్నితోపాటు ముష్టెత్తుకుంటూ తిరిగే పెంచెలమ్మ కన్నికన్న ఎక్కువదుడ్డు సంపాదించేది. కాంక్షలతో చూడని మర్యాదను నిలువునా సంపాదించేది. సిపాయీల అసభ్యపు అసహ్యపు మర్యాదను భరించలేక కన్ని రైలుదగ్గిర ముష్టెత్తడం మానింది.

## 3

ఇన్నాళ్లూ ఖర్చుపోను ముష్టివల్ల కూడబెట్టి సంపాదించిన యిరవైరూపాయిలూ రెణ్ణెల్లలో అయిపోయాయి. కాని కన్ని ఒక తెల్లని పెద్ద వెండినాణాన్ని మాత్రం అతి రహస్యంగా ఓ చోట దాచుకుని పైకి తీసేదికాదు. ఆ నాణెము అమెరికా డాలరు వెండినాణెము. అది తనకిచ్చింది ఒక సిపాయి. మూడువందల జన్మలెత్తినా కన్ని ఆ సిపాయిని మఱచిపోలేదు. ఎంత పొడుగ్గా వున్నాడా కుఱ్ఱవాడు!! ఒక రోజున బొంబాయి యెక్సుప్రెస్సు గుత్తిస్టేషనులో చాలాసేపాగింది. యథాప్రకారం సిపాయిలందరూ తన డబ్బాబ వేశారు. పళ్లూ గిరవాటు వేశారు. నానురొట్టె లుచ్చుకు కొట్టారు. ఇంతలో ఓ సింహంలా ఆ మదరాసు నాయళ్ళబ్బాయి ఊరకుక్కలు అల్లరిపెట్టే ఆవుదూడ దగ్గరకు వచ్చే మాతలా వచ్చాడు.

"నీ పేరేవరు?"

"కన్నె అంటారుసామీ!"

"ఇదిగో కన్నీ! నీకుదా ఈ ముష్టి ఎందుకు?"

"చక్కని నీ మొగంలో విషాదం కురవబోయే...ఏ... మొయిల్లావుంది. నాన్దా మద్రాసు నాయిళ్ళకుఱ్ఱాణ్ణి. ఆఫ్రికాలో జర్మనువాణ్ని చావకొట్టి అలసటపడి ఇంటికినెల రోజులు సెలవుమీదదా వస్తుంటిని. ఆ యుద్ధములో ఒకఅమెరికాసైనికుణ్నిదా, నాన్దా రక్షిస్తిని. వాడిదేశంనాణెందా ఇది. బహుమతి ఇచ్చినాడు. ఇది నీదగ్గిర గుర్తుగావుంచుకో, ఈ దుడ్డుతీసికొని రేపణ్నించి ముష్టిదా మానెయ్యి" అని తనచేతిలో ఇన్ని రూపాయినోట్లు, ఒక డాలర్ నాణెము పెట్టి కదలబోతూన్న రైలెక్కి మాయమైపోయాడు.

## 4

ఆ మర్నాడునుంచి కన్ని ముష్టిమానింది. తమపశుత్వ ఆకలిని తీర్చుకోడానికి ఆ బాలికను తమ పక్కలపైకి రమ్మని పలువురు ఆశించారు. పలువురు కన్నులతో కబళించారు. ఆరు కడుపులున్న తనకుటుంబాన్ని రక్షించుకోడానికి ఆవిధంగా ధనం సంపాదించే సులభమార్గాన్ని కన్ని మైలుదూరమైనా రానిచ్చిందికాదు. రహస్యంగా దాచుకున్న ఆ డాలరునాణెం కన్నుల కద్దుకొనేది.

"ఏదారి వచ్చావో?
ఏదారి పోయావో
నీదారి నీదిరా !
నాకు దారే లేదురా"

గొణుగుకొనేది. అప్పటికి మూడురోజులనుంచి ఆ ంబానికి తిండిలేదు. తల్లీ తండ్రీ అందరూ "మాయ ండకు మానాభిమానా లొచ్చాయంట" అని తిట్టారు. తిండిలేక నీరసపడిపోయిన కన్ని కదలదు. రైళ్ళువస్తున్నాయి పోతున్నాయి. ఊళ్ళోవున్న బస్సుడ్రైవర్లు, మంగలిషాపు వాళ్ళు, హోటలుపనివాళ్లు, ఈ చిక్కిపోయిన బక్కముండ ఎవరిక్కావాలి? అని చక్కాపోయారు. వారిక్కావలసినా, కన్ని సిద్ధంగావుందా? దెబ్బతిని చచ్చిపోయే పెద్దపులిలా వాళ్ళని చీల్చి చెండాడి, చచ్చిపోయివుండును కన్ని. ఆ రాత్రల్లా వారున్న గుడెసెప్రక్క అతి ఆకలిమత్తులో చావు బ్రతుకులసంధ్యలో సర్వప్రపంచమూ మరచి పడివుందికన్నె. తెల్లవారుతూంది. "కన్నె ఎక్కడా?" అని ఒక గంభీర కంఠం వినబడింది. అంతటి శల్యావశిష్టావస్థలోనుంచి, కోటి ఆనందాలతో ఆ కంఠం ఆనమాలుపట్టిన కన్నె 'ఇక్కడే వున్నాను నాయుడుబావా!' అని కాకలీస్వనంతో జవా బిచ్చింది. ఒక్కఛంగున రామస్వామినాయుడు ఆ బాలిక దగ్గిరకు ఉరికాడు. ఎముకల పోగైన కన్నెను తనహృదయాని కదుముకొన్నాడు. ఆ కౌగిలింత సంజీవి. అతని హృదయము సంజీవిపర్వతము.

## 5

రామిస్వామినాయుడు వాళ్ళింట్లో పదిరోజులున్నాడు. ఊళ్ళో చిన్నయిల్లు అద్దెకుతీసుకొని అక్కడ ప్రవేశపెట్టిం నాడు. నీళ్లు పోయగా పసిమిపొంది మిలమిలలాడి జాజి ఎట్టులా కన్ని వెనకటి అందంఅంతా తెచ్చుకుంది.

"చిన్నతనాన్నుంచీ బస్సులదగ్గిరదా ముష్టి కన్నీ! అటునుంచి నేనూ ఇక్కడ నువ్వూ నదుల్లా కెట రైలునుంచి చూచిన నాకు, నువ్వు ఏనాడో తప్పిపోయి నేస్తురాలివిదా కనిపిస్తివి."

రామస్వామి కన్నెకు అందాలమెడచుట్టూ మూడు ముళ్లూ వేసినాడు. మఱి పదిరోజులికి రామస్వామి యుద్ధానికి వెళ్ళిపోయినాడు. దేవుడైన తన రామస్వామిని తలుచుకుంటూ నెల నెలకూ ఆతడు పంపించే ఐశ్వర్యంతో కుటుంబాన్ని రక్షించుకుంటూ ఆతడుతప్ప ఇతరమేలేని అతనికొరకై పదిదినాలకిందటివరకూ కన్ని కనిపెట్టుకొనేవుంది.

"ఇటలీయుద్ధము నెగ్గాము. నాకుడిచేయి ఇటలీకి అర్పించాడు. కాని ఆరోగ్యము మహా సముద్రంలావుంది. నిన్ను గట్టిగా కౌగిలించుకొనేందుకు ఒకచేయలేదు కన్నీ!" అని రామస్వామి టెల్గ్రాము. నా ప్రాణమేఅయిన నా సామికి నేను ఒకచేయికాలేనా! అని కన్ని అనుకుంది.



1926

